శ్రీరామః!

# సరోజిని.

పురాణస్థమగుకథ.

పానుగంటి లక్ష్మీనరసింహరావుచే

రచింపఁబడి.



మొదటికూర్పు వేయిప్రతులు.

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రకటింపఁబడెను.

1930.

 [12 అణాలు.

# పీ ఠి క.

ఇది నాయిరువదిమూఁడవనాటకము. దీనిలోని కథ పురాణస్థ మైనది. ఈకథను నాకు నామిత్రులైన మ॥ రా॥శ్రీ ఓలేటి పార్వతీశ కవిగారు చెప్పినారు. వారికి నమస్కారములు.

ఈనాటకము శ్రీ శ్రీ పీఠికాపురాస్థానమహారాజావారిధనసాహా య్యమున నచ్చువేయించితిని. శ్రీ శ్రీ మహారాజుగారికి వారికుటుంబ మునకుఁ బరమేశ్వరుఁడు సర్వశ్రేయముల నొసఁగి రక్షించుఁగాక.

దీనికి నాందీప్రస్తావనలను నామిత్రులగు బ్ర॥శ్రీ కూచి నరసిం హముగారు వ్రాసి యిచ్చినారు. వారికి నమస్కారములు.

పిఠాపురము
28-9-30

పా. ల. నరసింహారావు.

## ఇందువచ్చు పాత్రములు.

**పురుషులు.**

పద్మనాభశాస్త్రి—కథానాయకుఁడు.

వాతాపిశాస్త్రి }<br>నారాయణశాస్త్రి } విష్కంభమున వచ్చు బ్రాహ్మణులు.

**స్త్రీలు.**

సరోజిని—కథానాయిక.

పార్వతి—పద్మనాభశాస్త్రి రెండవభార్య.

గవరమ్మ—మందులమ్ముకొను స్త్రీ.

శ్రీరామా !

# స రో జి ని.

నాం ది.

శా. ఏయొక్కింతకతంబు లేకయె సదా ♦ హృత్తాపముం గూర్చుచున్
గాయం బగ్నివలె న్దహించుచును లో♦కం బేచు నీర్ష్యాంగనన్
భూయశ్శక్తిని గాంచి, పంపి జగము ♦ న్బొక్కించు శ్రీమన్మహా
మాయాదేవి తదార్తినుండి మిము సం♦రక్షించుత న్సత్కృపన్ !

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు—(ప్రవేశించి) బావా ! పారిపార్శ్వకా !

పా—(ప్రవేశించి) చిత్తము, ఏమిసెలవు ?

సూ—ప్రదర్శనమునకు సర్వము సంసిద్ధముగా నున్నదా ?

పా—ఆ ! కవివర్యుఁడగు శ్రీపానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు గారి యిరువదిమూఁడవనాటక మైన 'సరోజిని'ని బ్రదర్శిం చుటకేనా ?

సూ—ఔను, నీ వెట్లు గ్రహించితివి ?

పా—ఈమాట మీరు మాసముక్రిందటనే చెప్పినారు, మఱచితిరి కాఁబోలు !

సూ—సత్యమే ! ఇందు నూనిమిచేఁ గలిగిన నాస్మృతిలోప మగచు

చున్నది కాని నీమతివిశేష మేమియు లేదు. కాను గోనీ యట్లాలోచించుచున్నావేమి ?

పా—మఱేమియు లేదు. తెరలోనుండి మీనాందీస్తవము విని, అన్యో! పరమేశ్వరస్తుతి మాని ప్రకృతిస్తుతి చేసినాఁ డేమి యీయన? యని యాశ్చర్యపడితిని. అదికూడ మీచరమ వయోధర్మమేమో యని యిప్పు డాలోచించుచున్నాను.

సూ—కాదు, కాదు.

ఆ. దాహశక్తి హవ్య♦వాహనునకు నెట్లొ
యట్లె మాయయుఁ బర♦మాత్మునకును;
బ్రకృతిపురుషు లొకరి ♦ నొకరు వాయకయుంద్రు
ధర్మధర్ములట్లు ♦ తథ్యముగను.

గీ. ప్రజలు జగతిని బహుసర్వ♦బాధలకుఁ గ
తంబు శుద్ధనిష్క్రియపు బ్ర♦హ్మంబు గాదు
గుట్టు తెలియంగనీయక ♦ పట్టువడక
మహిని మురిపించు కలను బో♦వు♦మాయ గాని.

మహాజ్ఞాని యగు శ్రీశంకరాచార్యస్వామికూడ మొదట నిరసించి, సిస్సత్త్వ... పిదప నేమహాదేవికిఁ జేతులు జోడించి; మొక్కుట తప్పినదిగాదో, సర్వప్రపంచమూలమగునాయాది శక్తిని నేను బ్రార్థించితిని. అందు వైపరీత్య మే మున్నది? ప్రత్యాహారకులు కరుణించి విడిచినచోఁ బరమార్థఫల మప్రయత్నముగాఁ దానంత నదియే సిద్ధించును.

పా—(నవ్వుచు) బావగారూ! పరమలౌకిక పుఁ బ్రవృత్తుల విపులీకరించి, యభివర్ణించుచు వ్రాసిన నాటకపుఁ బ్రస్తావనలోఁ బనికిమాలిన వేదాంతవచనము లాడుచున్నారు! ఇట మాయప్రసక్తి యే

మున్నది? పద్మనాభశాస్త్రి పెండ్లిచేసికొనని ప్రచండవాదము చేయుట మాయయా? పెద్దభార్య బలవంతపెట్టి రెండవపెండ్లి చేయుట మాయయా? మీతత్త్వవాక్యములు నాతలకెక్క- బోధపడుటలేదు.

సూ—అట్లు బోధపడని దానికే, ఔననియుఁ గాదనియుఁ గూడఁ జెప్పుటకు వీలులేని దానికే, వేదాంతులు 'మాయ' యని పేరుపెట్టినారు. లౌకికజీవనమున కుపయోగించి, ప్రజల సత్ప్రవృత్తులలోఁ బెట్టి చక్కఁగా నడిపించుటకే వేదాంతము పుట్టినది. ఈనాటకములో మాయాప్రభావ మేమియు నగపడుట లేదనుకొనుచున్నావా యేమి?

సీ. ఒల్లనొల్లను ద్వితీ♦యోద్వాహ మని పోరి
తరుణితీపులలోనఁ ♦ దగులుకొనుట,
బహుదూరదృష్టియు ♦ గృహమందలియసూయఁ
దఱిఁ గాంచఁజాలని ♦ ప్రాబయగుట,
లేలేఁతప్రాయంపు ♦ లేమ లోకోత్తర
శాంతిసౌశీల్యము ♦ ల్గనఁబఱచుట,
పరమపతివ్రత ♦ పరహితతత్పర
చిటికలో రాకాసి♦చేడె యగుట,

గీ. యీసుచే నులమలమాడి ♦ యింతి యొరుల
కొఱకుఁ దప్పినగోతిలోఁ ♦ గూలి, తానె
చచ్చుటిదియెల్లఁ ద్రైలోక్య♦జననిమాయ
యద్భుతపులీలయే కాక ♦ యన్యమయ్యె?

పారి—మీరు చెప్పినది సత్యముగానే గోచరించుచున్నది. సరోజిని యీశ్వరచర్యలు మహాఘోరముగ నున్నవి.

సూ—ఉండవా మఱి? నాటకము భయానకరసాత్మక మైనది. కవి బహుగ్రంథకర్తయై నాటకరచనయందు దారితేలినయతఁడు.

పా—కాని బావా! పార్వతీపాత్రముమాత్రము పరమపవిత్రమైన పాత్రము. ఆమె యేల మాయామాతవలలోఁ బడలేదో తెలియదు.

సూ—తెలిపెదను విను. మాయామాత యితరులకు మహాభీకరురాలుగాఁ గాన్పించునుగాని తనభక్తులకును, భక్తురాండ్రకును అతిసౌమ్యమూర్తిగానే తోఁచును.

గీ. కోతులను బట్టి యెలుకను ♦ జీరి చంపు
క్రూరమార్జాలి తనముద్దు♦కూన కెట్టి
బాధ కలుగనియట్లు తాఁ ♦ బండ్లఁ బట్టి
కొనుచుఁ గొంపోయి కాపాడు♦కొనునుగాదె!

పా—నిజము బావా! నిజము! లోకమాత యామె నన్ను రక్షించి సరోజినిని దుర్మరణము పాలుచేసినది. ఆమెకు సుఖములు కష్టాంతము లైనవి.

సూ—అట్టిమాటలే పల్కుచుఁ బ్రదర్శనముఁ బ్రారంభించుటకుఁ బద్మనాభశాస్త్రి రాఁబోవుచున్నాఁడు. ప్రస్తావన చాలించి మన మింకఁ బోవుదము రమ్ము.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

కూచి నరసింహము.

శ్రీరామా!

# సరోజిని.

## ప్రథమాంకము.

ప్రదేశము—శ్రీరామపురము.

ప్రవేశము—పద్మనాభశాస్త్రి, యతనిభార్య సరోజిని.

ప—ప్రాణప్రియా! సరోజినీ! నీవు బోధించిన యాలోచనమునం గీడు తప్పక వాటిల్లు నని యిదివఱ కెన్నిసారులో చెప్పితిని. ఇంక నదియే పట్టుకొని నన్ను బాధించుట తగునా?

స—నాథా! నీసేవకురాలను. మిమ్ము బాధించుటకు నేను ప్రయత్నింతునా? మీకు నాకుం గలిగియున్న బాధ యేదో, మందభాగ్యుల మైన మనమూలమున వంశమునకుం గలిగినబాధ యేదో తొలంగిపోవలయు నని నే నింతగాం బ్రాకులాడుచున్నాను. నీతండ్రిగారు నిన్నుం గాంచంబట్టికదా వారిఖ్యాతి, వారిపాండిత్యము, వారివంశము నీవు నిలుపంజేసినావు. నీకు నడివయస్సు దాంటుచున్నది. నీతో నిఁక నీపేరు పోవలసినదేనా? నీతండ్రిపేరు పోవలసినదేనా? నీవంశము పోవలసినదేనా? అట్టిదురవస్థ వచ్చునేమో యను భయముచేత నే నిన్నుం దిరుగ వివాహముం జేసికొమ్మనుచున్నాను.

ఘ—అ. మొదటిమనువు వాఁడె ♦ మూఢాత్ముఁడై యుండ
మాఱుమనువు వాని ♦ మాట యేమి ?
ఆరగించు జ్వరితుఁ ♦ డసుసంశయుఁడు గాఁగ
మఱలఁ దినెడు వాని ♦ మాట యేమి ?

స—నాథా ? ఏటిమాటలు ? ఇష్టముండునా ? సంసారములో నుండి సంసారకృత్యములు నిర్వహింపవచ్చును. లేదా వేదాంతములోఁ బడి యాదారిని బోవలసినది. అంతేకాని సంసారపుగొడవలనుగూర్చి మాటలాడుకొనునప్పుడు వేదాంతవచనములు చెప్పి, వేదాంతిమార్గములఁగూర్చి మాటలాడుకొనునప్పుడు సంసారపుసంబంధములు చెప్పి యెగఁబెట్టి మోండి చేయిచూపుట ధర్మము కాదు. మొదటిమనువువాఁడు మూఢాత్ముఁడని సిద్ధాంతమా? మనువుమానినవా రెవరు? యోగులు మానిరా ? వేదాంతులు మానిరా ? మహర్షులు మానిరా ? తప్పో యొప్పో, మీరుకూడ వారితోపాటు పెండ్లిచేసికొంటిరి. నామహాపాపముచేతి నాపెండ్లి ఫలించినది కాదు. తిరుగఁ బెండ్లిచేసికొని పుత్రవంతుఁడ వగుము. ఎందులకు సందేహించుచున్నావు ? ఒకభార్య యుండగా రెండవభార్యను దెచ్చుకొనుటకు సందేహమా ? మీశాఖకు మూలపురుషుఁడైన యాజ్ఞవల్క్యమహర్షికి లేని సందేహము నీకెందుకు.? ఆయన యాచరించినట్లే—

ఘ—(లెంపలువైచుకొని) ఆయనకు నాకు సామ్యమా ? ఎంతమాట! ఆయన యవతారపురుషులు. తపస్సంపన్నులు.

స—పెండ్లాలను సమర్థించుకొనుటకుఁ బెద్దతప స్సెందులకు ? అవ

తారపురుషుఁడే కాని యాలి నాజ్ఞలోఁ బెట్టలేఁడా? ఏమీ మాటలాడరు ?

ప—నన్ను క్షమింపుము. నాకుఁ బెండ్లి యక్కఱ లేదు.

స—ఎందుచేత ?

ప—నాకుఁ బుత్త్రుఁ డక్కఱ లేదు.

స—ఏల ?

ప—పుత్త్రుఁడు లేఁ డేని దుర్గతి యనునమ్మకము నాకు లేదు.

స—అట్టినమ్మకము నా కున్నది. అందువలన నీకుఁ బుత్త్రుఁ డుండకో తీరదు.

ప—సరోజినీ ! అంతపట్టుదల యేల ? నేను దిరుగ వివాహముచేసి కొనినందువలన ననేక బాధ లున్నవి. అవి యన్నియుఁ దిరుగఁ జెప్ప నేల? నీ వాలోచించుకొన రాదా? పుత్త్రుఁడు లేకున్నను, ధనము లేకున్నను, కలహము లేకుండమాత్ర మిప్పటి కున్నాము. ఈలాగున దినములు వెడలనీ-నామాట విను.

స—నేను నాసవతితో దెబ్బలాడుదు నని సందేహించుచున్నావా? నే నంత మూర్ఖురాలనా ? నే నట్టిదాననే యగునెడల ని న్నిందుల కింత ప్రోత్సహింతునా ? నీ కాసందేహ మెంతమాత్రము వలదు. నా మేనగోడలిని నేను బహిప్ప్రాణముగాఁ జూచుకొనుచున్నాను. నీతరువాత నీలోకమున నాకు దాని కంటెఁ బ్రియవస్తువు లేదు. అది యత్యుత్తమురా లగు నని నావిశ్వాసము. దానిని నీకుఁ బెండ్లిచేసెదను. తగవుల కింక నవకాశ మేది ? నే నొక్కతె నున్నయెడల నీ కెంత శాంతిగ నుండునో మే మిద్దఱ మున్నఁగూడ నట్లే యుండు నని నిశ్చయముగా నమ్ముము.

ప—వట్టిమాట. కలహములు తప్పవు-తప్పవు-ప్రపంచవైఖరి నీవు [illegible] [illegible]గివా? అది యటుండనిమ్ము. మొట్టమొదట నీకు [illegible] నశించును.

స—హో-హో-హో. (నవ్వును) నాకు-అబ్బ!-నీపై ననురాగము నశించినా? సరిసరి. పెద్ద లగుచున్నందులకు మతి జంకుట కారంభించిన ట్లగపడుచున్నదే.

ప—ఈపెద్దతనములో నాకుఁ బండ్రెండేండ్లపడుచు నంటఁగట్టవలయు నని నీకుఁ దోఁచుట నాకర్మము కాదా? దానికి సుఖమా-నాకు సుఖమా? నీసలో నత్తరువు లే దని యది మొగము చిట్లించుకొనుట-చెంబులో నాముదమునిండుకొన్నదని నేనుదేవులాడుట-పూలదండకొఱ కది పాకులాడుట, పొడుముకుండకొఱకు నేను దడుముకొనుట-అది యట్టె యిట్టె నన్ను సమీపింప, నే నట్టె యట్టె వెనుకకు జంకుట-నా కెందు కిట్టిమహా కష్టానుభవము? ఇఁక సంతానయోగ మేమి-నాపిండకూడు.

స—అబ్బే! పిల్లలు గనలేనంత పెద్దతనము మీ కెక్కడిది? చాలు లెండు. మాపెద్దమామయ్యకు డెబ్బదియేడవయేటఁ జతుర్థభార్యకుఁ గొడుకు పుట్టలేదా? ముసలితనముదారి ముసలితనమే-కొడుకుదారి కొడుకే-దానికి దీనికి సంబంధ మేమున్నది?

ప—అలాగా! శారీరశాస్త్రములో నిది యొకక్రొత్తయంశమా? పోనీ, నాకెందులకు? కాని మఱియొకసంగతి. నీకు సవతి వచ్చినయెడల నాకు నీపైఁ బ్రేమ నశించుట నిశ్చయము. అట్టి దుష్టపరిస్థితి రాకుండ నన్నుఁ గరుణింపుము.

స—అది దొంగమాట! నీకు నాపై ననురాగము నశించు నని నేను నమ్మను. నీసుఖముకొఱకే నే నింతప్రాకులాడినప్పుడు నీవు

నన్ననాదరణ మొనర్తు వని నేను విశ్వసింపఁగలనా? పోనీ- అట్లే జరిగినను నేను విచారించుదానను గాను జుమా. నీవు నాతో మాటలాడ నక్కఱలేదు. నన్నుఁ జూడనక్కఱ లేదు. నాసవతితోనే సుఖమున నుండుము. నా కదియే కావలసినది. మీయిద్దఱసుఖమే నాసుఖము. నేను మీకిద్దఱ కుపచారములు సేయుచు దైవధ్యాన మొనర్చుకొనుచు నుందును. నాకుఁ గావలసిన దంతకంటె నేమియు లేదు.

క—ఇప్పు డట్లే యుందువు. తరువాత నన్నియు నీకే కావలసివచ్చును. నేను నీసవతిగదిలోఁ గూరుచుండి గుసగుసలాడఁగ నాగుసగుస లెందులకో నీకుఁ గావలసివచ్చును. నేను నాసరిక్రొత్త పెండ్లికూఁతుతో నవ్వినయెడల నానవ్వునకు మూలకారణ మేదో నీకుఁ గావలసివచ్చును. నేను నీమేనఁగోడలి కిటు రమ్మని సంజ్ఞచేయఁగ నాసంజ్ఞకుఁ బ్రధానహేతు వేదో నీకుఁ గావలసివచ్చును. నేను నాద్వితీయభార్యవంక యాథాలాభముగఁ జూడఁగ నెందు కట్లు చూచుచున్నా వని నీవు నన్ను నిలువఁబెట్టి యడుగకుందువా? నాచూపునకుఁ గారణ మేదో చెప్పినను నీవు నమ్ముదువా? నమ్మక నాచే భయంకరములైన ప్రమాణములను చేయింపకుందువా? ద్వితీయభార్యాగ్రహణ మహాపాపము నా కిప్పటికి లేదు కావున నీవు సుఖముగా నున్నావు. నన్ను సుఖముగా నుండనిచ్చుచున్నావు. అంతే కాని సంసారమున నుండఁదలఁచినవాఁడు, సుఖపడఁదలఁచిన వాఁడు, బ్రదుకఁదలఁచినవాఁడు రెండవసారి పెండ్లిపీఁటలమీఁదికి సిద్ధపడవచ్చునా? అదిగాక నాకు లేని దేవులాట నీకెందులకు?

స—ఎందులకా ? మీసంతానహీనతకు నేనే కారణమును. నావంటి మందభాగ్యురాలిని, నావంటిగొడ్రాలిని, మీరు వివాహమాడకుండినయెడల మీ కీదుర్యోగము సిద్ధించి యుండదు. నేను మీయింటఁ బడుటచేత మీయిల్లిట్లు నాశనమైపోవుచున్నది కదా యని నేను రేయుంబవల్లు లోలోపలఁ గుమిలికుమిలి యెంతయేడ్చుచున్నానో పరమేశ్వరునకే యెఱుక. ఈమహాపాపము నానెత్తిని బడకుండుటకై మిమ్ము బెండ్లిచేసికొనుమనుచున్నాను. కాని మీ రేమనుచున్నారు ? నేను బెండ్లి చేసికొనను. ఈపాపము నీతలపైఁ బడవలసినదే-నీ విందులకై ఘోరనరకశిక్ష ననుభవింపవలసినదే, శాశ్వతముగా ననుభవింపవలసినదే యని మీ రనుచున్నారు. భర్తవైన నీ కిది న్యాయమా? నాపాపవిముక్తికి, నాయాత్మశాంతికి నీవు తోడుపడ నక్కఱలేదా ? నామనస్సునందలి మహాపరితాపమును నీవు గ్రహింపక, నాస్వభావసారళ్యము నైన గుర్తెఱుఁగక, నన్ను వట్టికోపస్వభావురాలిగఁ దుచ్ఛురాలిగఁ గేవలసంసారలంపటురాలిగ భావించుట తగునా ? మీకన్నుసన్నలకు, మీ మందహాసములకు, మీకిచకిచలకుఁ గారణము చెప్పు మని నేను నిన్ను బాధింతు నని యనుకొనుచున్నావా ? నన్నుఁ గూర్చి యెంతనీచమైన యభిప్రాయము నీకున్నది !. నే నట్టి యధమురాల నైనయెడల ని న్నిందుల కేల ప్రోత్సహింతును? నీతో సంసారసుఖము నా కింక నక్కఱలేదు. అది నీతో సుఖపడుచుండఁగ నేను గన్నులలో నిప్పులు పోసికొనను. స్పష్టముగఁ జెప్పితినా ?

ష—చెప్పుటలోమాత్రము స్పష్టత కెప్పుడు లోపము లేదు. కాని—

స—ఆచరణలో లోపమువచ్చునేమో యని సందేహించుచుంటివి కావున నేను నీయిల్లువదలి విరాగినినై తీర్థయాత్రలు చేసికొనుచు, శేషకాలము దొరలింతును. నాపీడ యిట్లువదలినపిమ్మట సంతోషముగ నీవు భార్యతో నుండవచ్చునుగాదా ?

ప—అయ్యయ్యో! నీవు పీడగా నుంటి వని నే నంటినా ? నేను భార్యతో సంతోషింతు నని యంటినా ? నాకు భార్య యొకతె కావలయు నని యంటినా ? నిన్ను విరాగినిని గమ్మంటినా ? నిన్నిల్లు దాఁటి పొమ్మంటినా ? ఎందుల కీమాటలు ?

స—నేను జెప్పినమాట వినవా ? వినవా ?

ప—నామనువుసంబంధమైనమాట యైన వినను. నాకుఁ బెండ్లి యక్కఱలేదు.

స—ఎందుచేత ?

ప—అది నీకు మంచిదికాదు. నాకు మంచిదికాదు. దానికి మంచిది కాదు. దానికిఁ గర్భముచాలక బిడ్డపుట్టినయెడల బిడ్డకు మంచిది గాదు. ప్రపంచమునకు మంచిదికాదు. పరమార్థమునకు మంచిదికాదు.

స—ఏటిమాటలయ్యా ! నీవు చేసికొన్న రెండవపెండ్లితోఁ బ్రపంచమునకు సంబంధ మెందులకయ్యా ?

ప—నాయశక్తిచేత—

స—పరిహాసమునకు సమయముకాదు. నామేనఁగోడ లట్టిది కాదు. అది నీకు భార్య యగుట తప్పదు. నే నెన్నియో యోజించి నీమనువు సంకల్పించుకొంటిని. ఇదివఱకుఁ బదిదినములనుండి చెవి నిల్లు కట్టుకొని పోరుచుంటిని. నీవు విననైతివి. ఇది కడపటిసారి. నీవివాహ మిప్పుడు స్థిరపడక తప్పదు—తప్పదు.

క—సరోజినీ ! నీ కింత పంతము వలదు. ఆలోచించుకొందము. మనము పదిపదునాల్గుసంవత్సరములనుండికాఁపురము చేయుచున్నాము. భర్తృభార్యాసంబంధమువలనిసుఖ మేదో యంతయుఁ బూర్తిగా నెఱుఁగుదుము. ఇఁక గ్రొత్తగాఁ దెలిసికొనవలసిన దేదియు లేదు. ఎవరు తెలిసికొన్నను, నెంతకాలము తెలిసికొన్నను నిదియే కాని యింతకన్న తబ్బన మేమియు లేదు. ఈ యనుభవములోఁ బశువులు మనముకూడ సమానపాండిత్యము కలవారము. ఇఁకఁ గ్రొత్తకాఁపుర మింటిమీఁదఁ బడవైచికొనక యింతటితోనైన బుద్ధి తెచ్చుకొని యుండవలయునుగాదా?

స—పరిణయమునకు ఫలము భార్యను కౌఁగిలించుకొని పండుకొనుటయే యని పలుకుచున్నావు. అది కాదు. భార్యాపరీరంభము ప్రజాభివృద్ధి కెక్కడ సాధనము కాదో యక్కడ పరిణయఫలము లే దన్నమాటయే. అందుచేతఁ బెండ్లిచేసికొనక తప్ప దనుచున్నాను. ఒక్కపిల్లవానినిమాత్రము కనుము. అటుపైని సంసారమును బరిత్యజించి సన్న్యసింపుము. నేను సంతోషింతును. నీవంశములోని పూర్వులు సంతోషింతురు.

క—పోనిమ్ము. దత్తుని దెచ్చి పెంచుకొందము.

స—పెండ్లి కవకాశము లేనివితంతువులు చేయవలసిన కక్కుర్తిపని నీకేల ? మగవాఁడవు. పదునాల్గుపెండ్లిండ్లు చేసికొనుట కధికార మున్నవాఁడవు—ఓ—కానీ—

క—నీ వెన్ని చెప్పిన సరియే, యెంతపట్టుపట్టిన సరియే కాని నేను బెండ్లిచేసికొనను.

స—చేసికొనవా—చేసికొనవా ? నేను జెప్పినమాటలు విననే వినవా ? ఇఁక నీకు నాకు నింతేనా ? నీకు విధేయనై, యింతకాలము

నీయాజ్ఞలను శిరమున ధరించి ప్రవర్తింపలేదా ? ఇన్నిసంవత్స రము లూడిగము చేసిన దానిసయం దింతనిర్దాక్షిణ్యమా ? ఇంత యలక్ష్యమా ? ఇంత నిరసనమా ? నేను సిగ్గుబిడియ ములు లేనిదాన ననుకొంటివా ? మానుషము లేనిదాన నను కొంటివా ? పట్టుదల లేనిదాన ననుకొంటివా ? నే నీయవ మానమును సహింతునా ? నే నుండఁగా నీవు పెండ్లి చేసికొం దువా, కాక నే నీరాత్రి ప్రాణత్యాగమును జేసికొని నీకుఁ బెండ్లి కవకాశ మిచ్చెదనా ?

ప—అయ్యయ్యో ! ఆ క్లేశ మేల ? నాద్వితీయవివాహనాటకమునకు నీ యేడ్పు నాందియా ? నా యేడ్పు భరతవాక్యమా ? ఇంత దిక్కుమాలిన పెండ్లి నా కొనర్చి న న్నేల బాధింతువు ?

స—నీ బాధలు నా బాధలుగూడ నంతమగునట్లు నేను జచ్చుటకు సిద్ధమై యుంటినిగాదా ? (లేచును.)

ప—సరోజినీ ! వలదు, తొందరవలదు. నీవు చచ్చు టెందులకు? చెప్పినమాట విను. రవంత యాలోచించుకొందము.

స—పెండ్లి చేసికొనుట కాలోచన యెందులకు? ఇదేమి వ్యవసాయము చేయుటా, వ్యాజ్యము వేయుటా, వ్యాపారము చేయుటా ? పెండ్లి చేసికొనుటకుఁ బెద్దయాలోచన కావలయు నేమి ?

ప—నిజమే. ఆలోచన యున్నవాఁడు పెండ్లి చేసికొనియే యుండఁడు. నీవు చెప్పిన ట్లాలోచింపను. నీయిష్టానుసారము పెండ్లి చేసి కొందును లే.

స—నిజముగా నే— చేసికొందువా ? సంతోషమే— ఈమాత్రమున కిన్నినాళ్లు బిగిసితి వెందులకు? ఈమాసములో శుభముహూర్తము లున్నవా ?

ప—రెండవపెండ్లికి ముహూర్త మెందులకు ?

స—నీకు రెండవపెండ్లి గాని నామేనఁగోడలికి మొదటిదే కాదా?

ప—అలాగా ! అప్పటికొలఁది నాలోచింపవచ్చును.

స—పెండ్లిచేసికొను మనుసరికిఁ గిక్కడు మనకుండ మంగళస్నానము చేసి పీఁటమీఁదఁ గూర్చుండవలయును గాని యిట్లు భీష్మించుకొందురా ? నిక్షేపములాగున— పదుమూఁడేండ్లకుట్టిది— సిద్ధాన్నము. ఎగిరిగంతు వేయుటకు బదులు వెనుకాడెద వేమి ? నీవు దానిని జూచితివి కాదా ?

ప—చూడలేదు.

స—చూత కేమి ? మూఁడేండ్లక్రిందట నీకుఁ బ్రాణముమీఁదికి వచ్చినప్పు డది యిక్కడకు రాలేదా ?

ప—అలాగా ! నాకు జ్ఞప్తిలేదు. పోనీ- ఈసారి వచ్చినప్పుడు తిరుగ నంతపని జరుగఁగూడదా ?

స—మీ రింక నపశకునపుమాట లాడకుఁడు. నామనస్సునకుఁ జాల గష్టముగా నుండును. పోయి పండుకొందము. రండు.

ప—సరే నడు వచ్చుచున్నాను. (సరోజిని పోవును.)

గీ. మనువుకంటెను శుభము లే • దనెడుపలుకు
నాయెడ నసత్యమయ్యెఁ గా • నంగఁబడియెఁ
జావుకంటెఁ గష్టము వేరు • జగతిఁ గలుగ
దనుపలుకు నాయెడల మిథ్య • యయ్యె నకట!
నీకు మనువేల యని నన్ను • లోక మడుగ
సతిబలాత్కృతిచేతను • జరుపుకొంటి
ననవలెను గాదె, వేరేమి • యనఁగవచ్చు
నప్పలాటకు గుఱియయ్యె • నాపబ్రదుకు.

ఎఱిఁగియుండియుఁ దప్పాచ♦రించుచుంటి
నిష్ట మణువైన లేశాచ♦రించుచుంటి
బుద్ధికి స్వతంత్రతాశక్తి ♦ పోయెనొక్కొ
బుద్ధికి స్వతంత్రశక్తియే ♦ మొదట లేదొ ?

ఇష్ట మొక్కటి, జరిగెడు♦కృతి మఱొకటి
ధరణి నెల్లర కీగతి ♦ తప్ప దెపుడు
మనుజబుద్ధికి స్వాతంత్ర్య♦మహిమ యున్న
సృష్టిలో నింత వ్యత్యాస ♦ మేల కలుగు ?

ఏది యేలాగున జరుగనున్నదో !

(నేపథ్యమున) నాథా ! రారేమి ?

మ—ఇదిగో వచ్చుచున్నాను. (నిష్క్రమించును.)

ఇది ప్రథమాంకము.

శ్రీరామా!

# సరోజిని.

## ద్వితీయాంకము.

ప్రదేశము—శ్రీరామపురము.

ప్రవేశము—నారాయణశాస్త్రి, వాతాపిశాస్త్రి.

వా—నారాయణశాస్త్రీ! పద్మనాభశాస్త్రియంత యదృష్టవంతుని జూడలేదురా. ఏమికుల్కుదిరా! బొబ్బిలిపోడుముకాయలాగున నెంతవాటముగా నున్నదిరా! ఆసన్ననిమూతి యాగొడుపు నామెఱుఁగు! వహవ్వా! శేయుంబవల్లు రొంటఁ బెట్టుకొని తిరుగఁదగిన ట్లున్నదిరా. నీవాపిల్లను దిన్నగఁ జూడలేదా యేమి? విఘ్నేశ్వరపూజ మొదలుకొని, మంగళపుటారతివఱకు శోభనపుఁబెండ్లికూఁతునే తప్పవేయకుండఁ జూచితినిరా. గర్భాధానపుఁబెండ్లికూఁతు రదిగో! ఆలాగున నున్న యెడల దేవేంద్రభోగముకాదఁటరా!

నా—వాతాపిశాస్త్రీ! ఏదో పెద్దబ్రహ్మాండముగాఁ జెప్పుచున్నా వేమిరా? నేను బెద్దవాఁడను. నేను జెప్పినమాట విను. క్రొత్తపెండ్లికూఁతు లందఱు క్రొత్తపోడుములాగున గాటుగానే యుందురురా. ఆగాటు, ఆకమ్మఁదనము నిలువఁబడవురా.

మూఁడు రాత్రులు కాకుండఁగనే వట్టిదూఁగర. ఇందులో నున్న
కీలు కెక్కడ నున్నదనుకొన్నావు? కమ్మనివాసన గొట్టునట్లు
దోరయైనకాపు, గోరోచనపురంగు గల గోఘృతపుమేళవింపు,
మోతాదైన గుల్లసున్నపుఁబిసరు, గరుసు కాకుండ, మెత్తన
కాకుండ మట్టసమైన మర్దన—ఇవి పొడుమున కెట్టిదో పొలఁ
తికిఁ బ్రాయము సరిగా నట్టిది ఉత్తరక్షణములో నది పైసలే
.యిదిపైసలే. దిక్కుమాలిన ప్రపంచమురా! దేనికి నిలుకడ
లేదురా! ఇందులో నన్నిటికంటె పెద్దసొగ సేది యనుకొన్నావు? పెం
డ్లియైనమూఁడు నెలలు కాకుండనే పెద్దది యగుట--ప్రక్కలో
నికి సిద్ధపడుట-ఇదిమాత్రము కొంచెము విలక్షణముగా నున్నది.

వా—ఏలాగైన నేమి? పద్మనాభశాస్త్రి మహాదృష్టవంతుఁ డనక
తప్పదు.

నా—ఏమో! ఎవరు చెప్పఁగలరు? ఇది బలాత్కారమున జరిగిన
వివాహము. మగఁడు పెండ్లామును దిన్నఁగ నేలుకొనునో
లేదో. ఒకవేళ యేలుకొని దానినే మరగియుండుననుకో. సరో
జినివలన నెట్లు పుట్టిమునుఁగునో? ఏమి సందేహములో, యేమి
సంరంభములో, యేమి సంఘర్షణములో, యేమి సంక్షోభ
ములో, యెవఁ డెఱుఁగును?

వా—ఆమాటమాత్రము చెప్పకేమి. సరోజిని యెంతబుద్ధిమంతు
రాలు! ఎంతశాంతురాలు! ఎంతపతిభక్తి గలయిల్లాలు!
ఎంతదైవభీతిగలది!

నా—నే నెఱుఁగనంటరా? ఆమె యిప్పటివఱకు మంచిదే. నిశ్చయ
ముగా మంచిదే. కాని మంచితనానికిమాత్రము స్థిరత్వ మెక్క
డిది? ప్రాణ మున్నంతకాలము [illegible]

మంచివానిని మంచివాఁడనవలదు. చెడ్డవానిని జెడ్డవాఁ డన వలదు. అందులో సవతు లున్నకాఁపురములో శాంతి నిల్చు నా? మంచితనము నిల్చునా? అయినను ముందుగొడవలు మన కెందులకు? ఇండ్లకుఁ బోవుదమురా. పిల్ల నింక గదిలో నికిఁ బంపించుటయే యవశిష్టముకాదా? ఇఁక స్త్రీలగొడవ యే కాదా? రమ్ము! పోవుదము.

ఇది విష్కంభము.

---

ప్రదేశము—గర్భాధానపుగది ప్రక్కపంచపాళి.

ప్రవేశము—సరోజిని, పార్వతి.

స—పార్వతీ! రైకకిన్నిగూడ లున్నవేమే! తిన్నఁగాఁ దొడుగుకొన లేని చంటిపిల్లవఁటే! ఉండు నేను సరిచేసెదను. (సరిచేయుచు) రైకచేతులు కొంచెము పొడుగుగా నున్నవే. అంచులు లోనికి రవంత మడఁతును. (అట్లు చేయుచు) ఉన్నమిరియాలపే రొక్కటియుఁ బైటలో వేసికొంటి వేమి? పైనివేసికో లేక పోతివా?

పా—పైని వేసికొన్నయెడల డాబుగా నుండు నని జడిసి యట్లు చేసితిని.

స—ఈరాత్రి డాబుగా నుండుటకొఱకే పైని వేసికొమ్మంటిని.

కొన్నినాళ్లు గడచినతరువాత నేచీరయైన సరే యేరైకయైన సరే. తలకువ్వుకొన్న సరే చింపిరితలయైన సరే. సంసారఘోర శిలో రవంత పాత్రికబడినపిమ్మట నేమియు నక్కఱలేదమ్మా. క్రొత్త గనుకనే. ప్రపంచవైఖరి ననుసరించి యున్నంతమట్టులో రవంతనీటు కాసంతసింగారము. ఇదిగో నామెడలోని చంద్ర హారముం గూడ వైచికో (వేయును.)

పా—నీహారము నాకెందు కిచ్చితివి? అత్తా నీకో!

స—నామగనినే నీకిచ్చినప్పుడు హారమెంత? పార్వతీ! నా కింక సింగార మక్కఱలేదు. ఏసుఖముకూడ నక్కఱలేదు. పాపభీతి కలిగి, పతిభక్తి కలిగి పరాత్పరుని సేవించుచు దినము లీడ్చుచున్నాను. ప్రారబ్ధవశమున నాగర్భము ఫలింపలేదు. నీకడుపు ఫలించు నని నిన్ను నాయింటికిఁ దెచ్చుకొంటిని. ఎవతెయో క్రొత్తదైనయెడల నదియు నేను గాటులాడుదు మనియు నందువలన సంసారశాంతి నశించుననియు, గృహపవిత్రత మాసి పోవు ననియు భయపడి నాబహిప్ప్రాణము వైన నిన్ను నా స్థానమున నిలిపి నేను రవంత యోసరిల్లితిని. నీవు త్వరగఁ బెద్దదానవైతివి. నేను మహానంద మొందితిని. అంతకంటెఁ ద్వరగ గర్భవతివైనయెడల నాకుఁ గావలసిన దింకే నేమియు నుండదు. అందుకొఱకు నిత్యము కులదేవతల నారాధించుచున్నాను. పార్వతీ! జడబిగింపు గట్టిగా నున్నదా?

పా—ఒకరీతిగా నున్నది.

స—మీాపడుచుపిల్లల కెంత గట్టిగ బిగించినను సంతుష్టియుండదే. అది చాలులే. వెనుకకుఁ దిరుగు. జడచుట్టలో మల్లెపూలదండ

ముడుతును (అట్లు చేయును) పార్వతీ ! ముహూర్త మెన్నిగడియలకే ?

పా—నాకుఁ దెలియదు.

స—పంచాంగపు బ్రాహ్మణుఁడు పదిగడియల కని చెప్పినట్లు రవంత జ్ఞప్తి యున్నది. ఏదో నాఛాందసతకొలఁది నేను బెట్టించితిని. ఇప్పుడు తొమ్మిదిగంటలై యుండునా ?

పా—ఆ.

స—సరేకాని ఈరాత్రి ముహూర్తపుముచ్చటలు రేపు నాతోఁ జెప్పెదవా ?

పా—(తలవంచుకొని సిగ్గుపడి యూరకుండును)

స—(పార్వతిగడ్డము పట్టుకొని మొగము పైకెత్తి) ఏమే మాటలాడవు. సిగ్గుపడెద వెందులకు ? మనమునఁడే కాదా ? ఒక్కటియైన దాఁపకుండ నన్నియుఁ జెప్పవలయునుజుమా ?

పా—అత్తా ! పోసిమ్మూ. ఆమాట లెందులకు ?

స—అప్పుడే యెంటరెత్తుఁదనమా ? నీరహస్యాలు వేరా ? అవి నా చెవిని బడకుండ నీకు దాఁపటికమా ? ఏమే ! ఇంతలోఁతు గుండె గలదానవఁటే ?

పా—అత్తా ! నీ వట్లనుకొనవలదు. నీకు సర్వదా విధేయురాలను.

స—అలాగున నుండుదు వనియేకదా నా యాశ. ఇంతస్పష్టియు నందు కొఱకేకదా ? ననేమిరా పెండ్లివల దన్నభర్తను వివాహమున కంగీకరింపఁజేసినది నిన్నుఁ జూచుకొనియే కాదా ?

(నేపథ్యమున) సరోజినీ !

స—పార్వతీ ! నీ వాగదిలోనికిఁ బోయి యుండుము. ఇప్పుడే పిల్తును. (పార్వతి పోవును.) ఇక్కడ నున్నాను.

(పద్మనాభశాస్త్రి ప్రవేశించును.)

పద్మ—ఏమి చేయుచున్నావు ?

స—శోభనపు పెండ్లికూఁతును పెండ్లికొడుకు ప్రక్కలోనికి సింగారించు చున్నాను.

పద్మ—చూడు ! నీవట్టి వెఱ్ఱిపడకు. వెఱ్ఱివెఱ్ఱి ప్రయత్నములు చేయ వలదు.

స—పడుచు పెండ్లాము దొరకినందులకు వెఱ్ఱిపడవలసినవాఁడవు నీవు—వెఱ్ఱి, వెఱ్ఱిప్రయత్నములు చేయవలసినవాఁడవు నీవు-అంతే కాని——

పద్మ—సరోజినీ ! అప్పుడే కుట్టుమాటలాడుచున్నావా-నా కావెఱ్ఱి యెంతమాత్రమును లేదని నీ వెఱిఁగియుండియు నిట్లన వచ్చునా ?

స—ఏదో పరిహాసముకొఱకు రవంత నే ననఁగ నామాట లప్పుడే కుట్టుమాట లయిపోఁయినవా ? నీ వేమియు నట్లనుకొనవలదు. నాకు మహానందముగా నుండుటచేత నే నిట్టి వేడుక చేసికొను చున్నాను.

పద్మ—ఆ వేడుక లే-అనవసరములైన యా వేడుకలే వలదని చెప్పుచు న్నాను. మ మ్మిద్దఱను బాన్పుపై నొకరియెదుట నొకరిఁ గూర్చుండఁబెట్టి గంధము పూయించి, పుష్పమాలలు వేయించి, బొట్లుపెట్టించి, పేళ్లు చెప్పించి యేదో గంపతిరుగుడుగత్తర యంతయుఁ జేయింపఁదలఁచుకొనినావు. ఈ వెఱ్ఱిప్రయత్న ములే వలదని నిన్ను మందలింపవచ్చితిని. నామాట విని యాప్రయత్నమంతయుఁ గట్టిపెట్టుము. మహదాశీర్వచనము

తప్పదుకదా యని విధి లేక పీఁటలపైఁ గూర్చుండవలసి వచ్చినది.

స—ఆకొఱ్ఱిదానికిఁ దల్లి లేదు. తండ్రి వెఱ్ఱివాలకపువాఁడయ్యెను. దాని ముచ్చట లెట్లు తీరును? అవి తీర్చుటకు నేనుదక్క దానికి మఱెవ్వరున్నారు?

పద్మ—అట్లయిన దాని నొక్కతెను గూరుచుండఁబెట్టి నీయిష్టమువచ్చి నన్ని మంగళపుటారతులు పాడించుకొనుము. అంతేకాని యీసమయమున నే నక్కడ నుండను.

స—అదేమండోయి! గర్భాధానపుఁగాండ మొక్కపెండ్లికూఁతుతోడనే సాగించుట యెక్కడను వినలే దయ్యా. ఏమి విచిత్రపుమాట లాడుచున్నారు! చాలు చెంపు! చాలు!

పద్మ—ఇట్టి నిరర్థకపుముచ్చట లన్నియుఁ బెద్దవాఁడైన నన్నుఁగూర్చి హాస్యాస్పదములుగను, దూష్యములుగ నుండకమానవు. అందుచే నవి మాను మని నీతో నేను బట్టుదలతో నంటిని. నా యభిప్రాయము నీ వెఱిఁగియుండియు నిట్లు హేళనచేయుట నీకుఁ దగదు. నీముచ్చటలు నీవు చూచుకొనఁదగదు. నీవు నామర్యాదను గాపాడఁదగినది. నిమిషమాత్రపుముచ్చటల కొఱకు శాశ్వతప్రతిష్ఠను జంపుకొనుట ధర్మమా?

స—నాథా! మీ రంతపట్టుదలతోఁ జెప్పినప్పుడు నే నన్యథా చేయుదునా? నే నట్టివేడుకలు చేయింపను లెండు. పోనిండు. పెండ్లామునొద్ద పందుకొననైనఁ బందుకొందురా?

పద్మ—నీవు నాధర్మపత్నివి. స్వప్నమందైనఁ బరకాంతాస్పర్శ మెఱుఁగను. నాబ్రతుకు పవిత్రముగ వెడలనిచ్చితివి కావు. తిరుగ

నొకదానిని దాఁకునంతటి యధర్మము నాబ్రతుకున కంట
గట్టితివి. ఏమిచేయఁగలను?

స—అగ్నిసాక్షిగఁ బరిగ్రహింపఁబడిన యది మీకు ధర్మపత్ని యగు
నప్పుడు దానితోఁ గలసి యుండుటలో నధర్మ మేమున్నది?
నూతనధర్మశాస్త్రనిర్మాతవువలె నున్నావు. పురాణపురుషులని
ప్రఖ్యాతి నొందిన మహానుభావులలోఁ బైభార్యలను బరామ
ర్శింపనివా రెందఱో యున్నారా ?

పద్మ—వారు భార్యాబహుళత్వముచేఁ బురాణపురుషులు కాలేదు.
అలౌకికమహిమసంపన్ను లగుటచే నైరి. ఎవ్వరికైనను ధర్మ
నిర్వాహణమున కక్కఱకువచ్చునది మొదటిపత్ని యొక్క తెయే.
ఇందులకై నిన్నుఁ బూర్ణముగా నమ్మికొనియుంటిని.
(మీఁదఁ జేవైచి దగ్గఱకుఁ దీసికొని.)

గీ. ఒక్కభార్యను సేవించు ♦ చుండునాతఁ
డొక్కవిభు నాశ్రయించుచు ♦ నుండునాతఁ
డొక్కదేవుని ధ్యానించు ♦ చుండునాతఁ
డిహపరానందజలనిధి ♦ నీఁదులాడు.

స—నీ విదివఱకు నన్నుఁ బూర్ణముగా నమ్మియుంటి వని నే నెఱుఁగు
దును. నీశరీరము, నీమనస్సు, నీయాత్మయు నావే యై యుం
డెను. ఇంతటినుండి నాపై నాసపెట్టుకొనుట తగదు.

పద్మ—ఆమాటసంగతి ముందు చూడవచ్చును గాని నేను దానియొ
ద్దకుఁ బోవకముం దిప్పుడు నిన్నొకసారి గట్టిగాఁ గౌఁగిలించు
కొననిమ్ము. (అట్లుచేయును; కాని ముద్దుపెట్టుకొనఁ బ్రయత్నిం
చి పెట్టుకొనలేక పోవును.)

స—వలదు. వలదు. (తనలో) ఆహా! ఈనిముసమున నీతని బాహు

బంధమున నే నొందుచున్న సుఖమువంటిసుఖ మీపదునాల్గేం డ్లకాపురములో నెన్నఁ డెఱుఁగనే ! అయ్యయ్యో ! ఇట్టియను రాగపూర్ణునివలని సుఖము నాకొక్కతెకే కాకపోయెనే !

పద్మ — సరోజినీ ! ఎందఱు క్రొత్తభార్యలైన నొక్కప్రాఁతభార్య యగుదురు ? వల్లెవేసిన విద్య యిది. క్రొత్తభామలో సరిక్రొత్తపార మది. అది నోటి కంకదు. బుద్ధికి లొంగదు. మహావైణికుని చేతిలో నైనఁ గ్రొత్తవీణపెట్టి వాయింపు మనఁగ నైదు నిముసములలో నాల్గుతప్పులె ట్లంటె హాస్యాస్పదుఁ డగును. ఆఱఁగాఁగి చల్లారిన పాలిది. ఎగసి పొంగి బోరగిలఁబడున దది. సంతుష్టియైన భోజన మిది. ఎంగిలిలంఘన మది. ప్రాఁతమిత్రునికిఁ గ్రొత్తమిత్రున కెంతభేద మున్నదో చెప్పవలయునా ? మనస్సున కక్కడ మొండిగుఱ్ఱపువెనుకాటయే కాని యిక్కడి పందెపుగుఱ్ఱపుఁబరు వెక్కడిది ? ప్రాఁతజోడు పరిపాటిచే సుఖమిచ్చును. క్రొత్తజోడు పడఁగఱచును.

స — ఏమి నాథా ! క్రొత్తప్రాఁతలఁగూర్చి యెంతవిచిత్రోపన్యాస మిచ్చితివి! ప్రాఁతభార్య యైనను మొదటినాఁడు క్రొత్తదియే. క్రొత్తభార్యయైనను రెండవనాఁడు ప్రాఁతదియే. ఇంతయే కాని యింతకంటె నేమైన నున్నదా ? ఈమాటల కేమి, కాని నీతో నొక్కముఖ్యమైనవిషయము చెప్పవలసియున్నది. నీవు నన్ననవసరముగ నిప్పుడు కౌఁగిలించికొని యాదరించుటచేత నామనస్సు కలుషమైనది. ఇట్టికలఁత యిప్పుడు కలుగఁదగినది కాదు. నీవు వెంటనే నీగదిలోనికిఁ బొమ్ము. నన్నింక దాఁక వలదు. నేను నిన్నుఁ గోరువఱకు నీవు నన్ను స్పృశింపఁ గూడదు. ముహూర్త మాసన్న మగుచున్నది. నాథా! నమ

స్వీకారము. మనపెద్దలు తరించినట్లు, మనము తరించునట్లు పుత్త్రినిమాత్రము కనుము. చక్కని గదిలోనికిఁ బొమ్ము.

పద్మ—మండు వేసవికదా, గదిలోఁ బండుకొనుట యెంతకష్టమో యెఱుఁగవా? అందుచే గదిప్రక్కపంచపాళిలోఁ బండుకొందును.

స—అక్కడఁ గూడ మంచ మున్నది. కావున నీయిష్టమువచ్చిన ట్లొనర్పుము.

పద్మ—అట్లయిన నన్నుఁ బొమ్మందువా?

స—అవశ్యము. నీవు ముందుగాఁ బోయి యటఁ గూరుచుండుము. నేనుఁ బెండ్లికూఁతును దెచ్చి నీ కప్పగింతును.

పద్మ—సరే. దయయుంపుము. (నాల్గడుగులు ముందునకు నడచి వెనుకకు వచ్చును.)

స—తిరుగ వచ్చితి వేల?

పద్మ—ద్వితీయభార్యాసమావేశము నే నెఱుఁగను. సపత్నీసమావేశము నీ వెఱుఁగవు. మనసంసారములో నిట్టి సమావేశము సుఖమునకే వచ్చినదో, దుఃఖమునకే వచ్చినదో తెలియదు. ఏది వచ్చిన సరే యనుభవింపక తప్పదు. అందుకు సిద్ధముగనే యున్నదము. కాని యొక్కసంగతిమాత్రము మఱవ వలదు. నీకు నాయెడల నెందునుగూర్చియైన సందేహములు గలుగగనే నీ వది మనస్సులోఁ బెట్టుకొని, క్రమముగా వృద్ధిపఱచుకొని, నీవు బాధపడి, నన్ను బాధింపక వెంటనే యాసందేహము నన్నడిగి నివృత్తి చేసికొని, నిష్కల్మషచిత్తవు కావలయును. నేను నట్లే చేసెదను.

స—నీవు నాయెడల నెట్లు నడచుకొనవలయునో నీ వెఱుఁగవా?

నేను నీయెడల నెట్లు నడచుకోవలయునో నే నెఱుఁగనా ? లోపము లెందులకుఁ గలుగును ? సంశయము లక్కఱలేదు. నివృత్తులక్కఱలేదు. ఇదివఱకు దినము లెట్లు గడచెనో యిఁక ముందుఁగూడ నట్లే గడచును. ఊరక త్రొక్కులాడుట తగదు. లోకములోఁ బహుగురేసి భార్యలను సంబాళించుకొను వారు లేరా ? వారు తలలు పగులఁగొట్టుకొని చచ్చుచున్నారా ? నాల్గుదినములు రవంత క్రొత్తగ నుండునేమో ! తరువాత పాఁతపడియే పోవును. నీ వింక మాటలతో నాలస్యము చేయఁదగదు. త్వరగఁ బొమ్ము.

పద్మ—మఱి యొక్కసారి కౌఁగిలించుకొని పోదునా ?

స—వలదు. వలదు.

పద్మ—వలదా-వలదా ? (దరిచేరును.)

స—(దూరమునకుఁ బోయి) వలదు. వలదు.

పద్మ—సరే నేను బోవుదును. దయయుంపుము.

(పద్మనాభశాస్త్రి పోవును.)

స—ఆహా ! కౌఁగిలించుకొనకుండనే పోయినాఁడే ! ఎంత పని చేసినాఁడో ! నేను వలదన్నంతమాత్రమునఁ గౌఁగిలించుకొనఁ గూడదు కాఁబోలునేమి ? నాపైఁ దన కామాత్రపు చనవు లేదు కాఁబోలునేమి ?—ఊఁ. పార్వతీ !

(పార్వతి ప్రవేశించును.)

స—గదిప్రక్క పంచపాళిలో నీభర్త కూరుచున్నాఁడు. నిన్ను నే నచ్చటకుఁ దీసికొనిపోవుదును. నావెంట రమ్ము. నీశుభకార్యమునకు నే నెన్నియో వేడుకలు చేయింపవలయు నని యనుకొంటిని. కాని నీభర్త యందుల కిష్టపడ లేదు. నీవు మ[illegible]

యు ననుకొనవలదు. మనసు, మనసుకలసినప్పు డే వేడుకలు నక్కఱలేదు. కలయనప్పు డంతకంటె నక్కఱలేదు. అందుచే నీవు భర్తను భక్తితో సేవింపుము. ఆయనయనుగ్రహమునకుఁ బాత్రమవై పుత్త్రవతివి కమ్ము. రమ్ము.

(ఇద్దఱు నిష్క్రమింపఁగ తెరయెత్తఁబడును. గదిప్రక్కనుబంచపాళిలో మంచముపై పద్మనాభశాస్త్రి కూరుచుండును.)

పద్మ—

గీ. వలయువలయు నంచుఁ ♦ బ్రార్థనల్ సలుపఁగ
నొక్కసుతుని దేవుఁ ♦ డొసఁగ లేదు
వలదు వల దఁటంచుఁ ♦ దలఁగొట్టికొని యేడ్వ
మెడను గట్టినాఁడు ♦ పడుచుదాని.
ఉన్న మొదటిభార్య ♦ యున్నను సరియె లే
కున్న సరియె యంచు ♦ నున్న వేళ
దానిపై మఱొకతె ♦ దాపురింపగఁ జేసె
శ్రీవిభుం డిఁకేమి ♦ చేయవచ్చు ?
ఏది యెప్పు డెంత ♦ యేరీతి వచ్చిన
శిరము వంచి మఱియుఁ ♦ జేతు లొగ్గి
యనుభవింపవలయు ♦ నంతయే మనపని
జీవులెల్ల బాని ♦ సీలు నిజము.

అదిగో ! నాప్రథమభార్య పునస్సంధానవధువును జేయి పట్టుకొని యిక్కడకుఁ దీసికొనివచ్చుచున్నది.

(పార్వతి, సరోజిని ప్రవేశింతురు.)

స—పార్వతీ ! చెప్పినమాట విను. లోనికి రా. (లాగును.)

పా—అత్తా! నా కక్కఱలేదు. ఊఁ.

స—నీకు నీ కక్కఱలేకపోవచ్చును గాని మాకుఁ దక్కఱలేదా?
(లాగును.)

పా—అబ్బ! అబ్బ! నాకు సిగ్గత్తా!

స—నిజమే. సిగ్గే మఱి. సిగ్గని యూరకుండునెడల సుఖ మేలాగమ్మా! ప్రపంచధర్మమమ్మా! ఇది లేనియెడలఁ గలియుగమే లేదు. ఆఁడుదానిపుట్టుక యెల్ల నిందుకొఱకేగాదా. (లాగును.)

పా—నేను నీవెంటనే వచ్చెదను. చేయిపట్టుకొని లాగకు. నొప్పియెత్తుచున్నది.

స—చేయివదలివైచినయెడలఁ దుఱ్ఱున వెనుకకుఁ బరుగెత్తుటకా? నీయెత్తు నే నెఱుఁగ ననుకొన్నావా? చాలులే. ఇంతసిగ్గు పనికిరాదమ్మా. ఇది యొక్క నీతలనే పుట్టెనా? మే మందఱము సిగ్గుపడినవారము కామా? ఏదో రవంత గుండెనిబ్బరము చేసికోవలయును. సిగ్గుదారిని సిగ్గుండవలయును. మన దారిని మనము సంసారము చూచుకోవలయును గాని—

పా—ఆలాగే అత్తా! నీసెలవ్వునకు బద్ధురాలను. ఒడలు దడదడ లాడుచున్నది. రవంతసే పాఁగినపిమ్మటఁ బోవచ్చును.

స—నీ విక్కడ నాఁగియున్నయెడల ముహూర్తము నీకొఱ కక్కడ నాఁగునా? నరునకు బుద్ధిబలముకంటె దేహబలముకంటె నదృష్టబలముకంటె ముహూర్తబలమే బలమమ్మా. బోదకాలి సిద్ధాంతిముహూర్తము మాత్రము దురాకట్టమమ్మా. ఈముహూర్తము లక్ష్యము చేయునిదోషముచేతనే కాఁబోలు నేను బం దిరిరాటలాగునఁ జిగురు చేపయు లేక యున్నాను. ఇఁక నాలస్యము పనికిరాదు. నీ వాలస్యము చేయునెడల నాకు

నీభర్తవలననే నింద రావచ్చును. రెండవభార్య చెప్పినమాట వినకున్నయెడల మొదటిభార్యకుఁ దిట్లు సహజమే కాదా?

పా—అత్తా! నీకు సహస్రనమస్కారములు. నావలన నీకు నిందగూడనా? అది మహాదోషము కాదా. నేను ధారాళముగా నీవెంట వచ్చెదను. చేయి వదలుము.

స—చేయిపట్టుకొనుట సదాచారమమ్మా! రమ్ము. (చేయిపట్టుకొని నడిపించును. ఇద్దఱు పద్మనాభశాస్త్రియొద్ద నిలువఁబడుదురు. సిగ్గుతోఁ బార్వతి వెనుకాడును.) నాథా! పెండ్లికూఁతును బెండ్లికొడుకునొద్దకుఁ దెచ్చితిని. ఏవిధమునైన ముచ్చటలు చేయుటకు నీ వంగీకరింపకపోవుట నామనస్సున కిబ్బందిగనే యున్నది. ఇదిగో దీనిచేతిని గ్రహింపుము. నేను బోవుదును.

పద్మ—(పార్వతిచేయిపట్టుకొనఁబోవఁగఁ బార్వతి తనచేయి వెనుకకు లాగుకొనుటచే పద్మనాభశాస్త్రి సరోజినిచేయి పట్టుకొనును)

స—నాథా! నాచేయి పట్టుకొంటి వేల? (తనలో) ఆహా! పార్వతిచేయి యనుకొని నాచేయి యత్యుత్సాహముతో నొడిసిపట్ట నాయొడ లాపాదమస్తకము జలదరించినదే! పదునాలుగేండ్ల క్రిందటి గర్భాధానపుఁబెండ్లికూఁతుసవస్థ నామనస్సున నంతలో మెఱసిపోయెనే. నూతనగర్భాధానమహోత్సవమును దిలకించు ప్రతికాంతకుఁగూడఁ దనపునస్సంధానపుముచ్చటలు జ్ఞప్తికి వచ్చును గాఁబోలును. కాక నాకొక్కతెకే యిట్టిసన్నివేశము కలిగినదేమో? (ప్రకా) నాథా! నాచేయి విడువుము. నేను బోవలెను. పార్వతిచేతిని బట్టుకొనుము.

పద్మ—(పార్వతిచేయి పట్టుకొనును, పార్వతి తనచేయిలాగుకొనఁ

ప్రవర్తించును.) (తనలో) పీటలమీఁదఁ గూరుచుండునప్పుడు తిన్నఁగఁ జూడనే లేదు. ఆహా! నూతనముగా నవతరించిన బంగారువంటిప్రాయముచే పెండ్లినాఁటిపిల్ల యిది యగునా కాదా యనుసంశయమును గలిగించుచున్నట్లున్నది! ఆహా! ఏమి మిసిమి! ఏమి మెఱుఁగు!

గీ. జగతినుఱ్ఱూటలూరించి ♦ యెగురఁజేయఁ
గలది సౌందర్యమహిమంబు ♦ గాదు కాదు;
అద్భుతాద్భుతముగ నట్టె ♦ యంకురించు
నబలదోరదోరయగుప్రా♦యంబు కాని.
లలన తనచేయి వెనుకకు ♦ లాగుకొనఁగ
నాకరముతోడ మదిగూడ ♦ నాతివంక
కీడ్వఁబడుచుండె నవశుఁడ ♦ నే మొనర్తు
మగువప్రాయంబునకు మహా♦మహిమ గలదు.

స—నాథా! నీనూత్నవధువుతో నీవు సుఖముననుండి సంతానవంతుఁడవు కావలయును.

పద్మ—సతీ! నీవు పరమయోగ్యురాలవు. విశుద్ధాంతఃకరణవు. ఈసందర్భమున నీవు ప్రవర్తించినట్లు మఱెవ్వరుఁ బ్రవర్తింపఁ జాలరు. నీ వట్టియుత్తమురాలవు.

స—(తనలో) ఈస్తోత్రపాఠ మంతయుఁ బొమ్మని చెప్పుట కుపోద్ఘాతము కాఁబోలు. అక్కఱలే దని నిరాకరించినయాతఁ డిప్పుడే మెత్తఁబడుచున్నాఁడే!

పద్మ—సరోజినీ! నీవు పెట్టించినముహూర్త మెన్నిగడియలకు?

స—(తనలో) ఉబలాట మెక్కువగుచున్నదే (ప్రకా) పొమ్మని నాకు జ్ఞప్తిచేయుట యెందులకు? పోవుటకే వచ్చితిని గాదా.

పద్మ—ఆఁ ! ఆఁ ! ఎంతమాట ! (కౌఁగిలించును)

(కౌఁగిటినుండి తప్పించుకొని సరోజిని పోవును.)

పద్మ—(తనలో) పరిహాసముకొఱకట్లనినది. నిస్సందేహము. (ప్రకా) పార్వతీ ! ఇంతసేపటినుండియు నిలువఁబడియుంటివేల ? కాళులు నొప్పులుపెట్టవా ? ప్రక్కపైఁ గూరుచుందువుగాని రమ్ము. (చేయిపట్టుకొని ప్రక్కకుఁ దీసికొనిపోవును.)

పా—ఊహుఁ—ఊహుఁ. (వెనుకాడుచునే ముందునకుఁ బోవును.)

పద్మ—పార్వతీ ! ప్రక్కపైఁ గూరుచుండుము. నీకు భయ మెందులకు ? పైఁట యట్టియట్టె యదరుటచే గుండెకొట్టుకొనునట్లు స్పష్టమగుచున్నదే. అదిగో ! ఎట్లు కొట్టుకొనుచున్నదో!

పా—(వెనుక వ్రేలాడుపైఁటచెఱఁగు ముందునకుఁ దెచ్చుకొని గుండెపైఁ గప్పుకొనును.)

పద్మ—ఎంతవెఱ్ఱిదానవు. పైట జోడించుకొన్నంతమాత్రమున గ్రమ్మఁబడునా ? పార్వతీ ! నిన్ను సింగారించినది మీ మేనత్తయేనా?

(రంగమునకొకప్రక్క సరోజిని ప్రవేశించును.)

స—మగనిపై భ్రాంతి యెక్కువగా నున్నది. దానిచేయి యనుకొని నాభర్త నాచేతి నుత్సాహముతో నుద్రేకముతో నుత్కర్షతోఁ బట్టుకొన్నప్పుడే మనస్సు కలతచెందినది. పంచపాళి విడిచి యీవలికి వచ్చునప్పు డనవసరముగాఁ గౌఁగిలించినాఁడే. దానితో మనస్సు మఱింత చెడినది. వీరు పంచపాళిలోఁ బండుకొనుటయే మంచిదైనది. గదిలోఁ బండుకొనునెడలఁ జూచుట కవకాశము లేదు. ఈగోడచాటునుండి యవలీలగఁ జూతును. పునస్సంధానవధూవరులు గదిలోనుండఁగా రహస్యముగఁ బుణ్యస్త్రీలు చూచునాచార మున్నదికాదా ?

పైవారే చూడఁ దప్పు లేనప్పుడు భార్య కడ్డేమి ? (పంచ పాళిపక్క నున్న గోడయొద్ద నిలువఁబడును.) అదిగో! అప్పుడే ప్రక్కఁ జేరి యొకరిప్రక్కనొక్కరు కూరుచుండినారే? నే నీపంచపాళిని విడిచి రెండు నిముసము లైనఁ గాలేదే. ఇంత లోనే యింతవఱకు జరిగినదా ? ఈక్రొత్త పెండ్లికొడు కప్పుడే దానిబుజముపైఁ జేవైచినాఁడే ? ఎంతకులుకుచుఁ గూరుచుండి నాఁడు ! నాకక్కఱ లేదు నాకక్కఱలేదు. ఊహూ ఊహూ యన్నయాతఁ డప్పుడే దానిప్రక్క నడఁగిమడఁగి యిఱికి నాఁడా ? పరిణయము నాకు వలదు వల దని పదిమాసములు బిగిసిబిగిసి నాప్రాణములు కటకటలాడించినయాతఁడు పది నిముసములైన నోపికఁ జేయవలదా ? ఇదే నన్నుఁ బట్టుకొన్న పెద్దపుట్టుమునుక. వారు కలసి సుఖముగ నుండుటకే కాదా నేను దేవులాడుచున్నాను. అట్టినాయొద్దతనకింత యసత్య మెందులకో ! మొదటినుండియు నింతవాపటిక మెందులకో !

పద్మ—పాణప్రియా ! ప్రాణప్రియా !

స—ఆఁ ! ఆలాగా! పాణప్రియయా? నీకది పదినిముసములకే ప్రాణ ప్రియ యయ్యెనా ? దీనికిఁ బూర్వము నీ కెవతెయైన ప్రాణ పిరియ యుండెనేమో జ్ఞప్తి యున్నదా ?—ప్రాణపిరియా ! యని పిలిచినవాఁడవు పైమాట చెప్పక యూరకుంటి వేమి ? కానీ— ఆముచ్చట యెట్లుండునో విందును.

పద్మ—ప్రాణప్రియా ! నిన్ను సింగారించినది నీమేనత్త యేనా యని యడిగిన మాటలాడ వేల ?

పా—(తలవంచుకొని) ఊఁ.

స—మేనత్తయా ? అక్కగా రని యనఁగూడదేమి ? నా పెద్దముద్దు

లనఁగూడ దేమి ? అక్కసంబంధము సవతిసంబంధము తెప్ప పాటులో నెగిరిపోయినదా ? నీ కున్న దొక్కయాధర్మపత్ని యేనా ? దానికిఁ జీరకట్టి, రైక దొడిగించి, సింగారించి నీప్రక్కలోఁ బెట్టి యడ్డమైన ఖానిసతనముఁ జేయుచు నీయింటిలో నున్న యీయాముసలిదొక్కు నీధర్మపత్నికి మేనత్తయా ? ఆఁ. అంతకంటె నీకది యేమియుఁ గాదుకాఁబోలు ? సెబాస్ ! విశ్వాసవంతుఁడవు.

పద్మ—పార్వతీ ! ఏదీ-ఈచంద్రహారము నీమేనత్తదే కాదా? (చంద్రహారము ముట్టుకొనును.)

స—(తనలో) అవసరమైన పనికొఱ కనవసరమైన ప్రశ్న. ఇది యొక శృంగారాలాప విశేషము. దానికిఁ దెలియకపోవచ్చును గాని నాకుఁ దెలియదా యేమి ? రెండవపెండ్లివాని కీవిలాసము లేలయో ? మాయాయన పదియునుముల పెండ్లికూఁతుమూలమున వయస్సులోఁ బదునాఱుసంవత్సరములు క్రిందికి దిగినవాఁడై మొట్టమొదటి సరిక్రొత్తగర్భాధానపుఁబెండ్లికొడుకై ప్రకాశించుచున్నాఁడు కాఁబోలు.

పా—మా మేనత్త నాకు వలదనుచుండగవైచినది.

పద్మ—అబ్బ ! తలవంచుకొనియే మాటలాడుదువేల ? (గడ్డముపట్టుకొని మొగము పై కెత్తును.)

గీ. ముద్దులొలికెడు నీచెక్కు ♦ టద్దమందు
నామొగపునీడ గనఁబడు ♦ నేమొ కాంతు—

(ముద్దుఁగొనఁబోవ పార్వతి మోము త్రిప్పుకొనును.)

స— బాగుగా జరిగినది. అంతే కావలసినది. కాని యిది యెక్కడి శృంగారము ? నాటకాలలో నున్న శృంగారధోరణి ననుసరిం

చుచున్న ట్లున్నాఁడే—సంసారపక్షపుశృంగార మంతయు సందు కొట్టించినాఁడే. అర్ధరాత్రమునఁ దనమొగ మద్దములోఁ జూచుకొనుప్రియత్న మెందులకు? క్రొత్తపెండ్లాముతోఁ గ్రొత్తమొగము వచ్చిన దనుకొనుచున్నాఁడా? ఈమొగానికి రెండవపెండ్లాముకూడనా? నాచేతిలోని కుఱ్ఱది కావున నంటఁ గట్టినాను. అంతేగాని తనమొగపుసౌభాగ్యమును గాంచి వలచివలచి వచ్చినవా రెవ్వరు లేరు. ఈమాత్రపుమొగమును రాత్రివేళ వేశ్యవలె, వేషధారివలె నద్దములోఁ జూచుకొనునా? కానీ—చూచుకో! దానిమొగము దర్పణమయ్యెనా? వజ్రఫలక మయ్యెనా? నేఁ జేసినపెండ్లిమూలమున నే నిప్పుడు మృణ్మయపాత్రినైతిని గాఁబోలు? ఇంతకుముందు నీవు నన్ను ముద్దుపెట్టుకొన్నప్పుడు నీమొగము నాచెక్కిటిలోఁ గనఁబడలే దేమి? అది నీమొగములోటా? నాచెక్కిటిలోటా? ఇంతలోనే యింత వెఱ్ఱివాలకములోఁ బడినావా?

పద్మ—గీ. ముద్దుఁ గొనఁబోవ మోముఁ ద్రిప్పుకొనుటీవి
ముద్దుఁ గొనుకంటె నధిక మౌ ♦ మోద మొసఁగె.

స—లభింపనప్పు డట్లు మనస్సునకు సమాధానము చెప్పుకొనకుండ నెట్లు మిడికెదవు? నాపునస్సంధానాని కీతని కీపాముమెలిక శృంగారము లేదు. ఉద్దేశ మొకటి, చెప్పుమాట యొకటి, క్రియ వేఱొకటి యైన యీకలగాపులగపు నానాసంకరపు శృంగారపుగాడిదెగత్తర లేదు. అగ్నిసాక్షిగాఁ జేసికొన్న పెండ్లామును గిక్కురుమనకుండఁ బ్రక్కలో వేసికొనవలసినప్పుడీనర్మసంభాషణ లేమి? ఈస్తోత్రపాఠాలేమి? ఈదర్పణాలేమి? ఈముఖదర్శనాలేమి? నాపిండకూడు—సల్ల

మంకుగు. కవులు పుస్తకాలలో నాలాగున నేడ్చినవేత్తురు కాక!
మనకుఁ గావలసినది సంసారపక్షములోనిమార్గము కాని సాత
స్వతిమార్గమా ?

పద్మ—వేసవికాలము తీవ్రముగ నున్నది. తెక తెక చే నుడికిపోవుచు
న్నాము. అందుపై మన్మథునితీక్ష్ణబాణప్రయోగమున మఱింత
కుమిలిపోవుచున్నాము. 'అట్టిస్థితిలోఁ బైఁటచెఱఁగు జోడించి
శీతకాలమునందువలెఁ గప్పుకొనినావు. నేను దీసివైతునా ?

(తీసివైవఁబోవ దూరముగఁ గూర్చుండును.)

స—ఆ. ఆ! మన్మథుఁడా? నలువది సమీపించుచున్న మారుమనువు
పెండ్లికొడుకు నిప్పుడు మన్మథుఁడు కొట్టినాఁడా ? ఈమన్మ
థుఁడు మొదటిగర్భాధానమున కేమైనాఁడు? సిగ్గుబిడియములు
మాయాయునకుఁ బోయినట్లే మన్మథునకుఁగూడఁ బోయినవా?
నాకడుపు ఫలింపలేదు. సంసారము గట్టెక్కలేదని యేడ్చి
గుప్పుచప్పున నొకకొడుకును గనవయ్యా యని నే నీపిల్లను
నాయవసరమునుబట్టి తనప్రక్కలో వేయుట యేమి ? ఈరని
కీసరసా లేమి ? ఈసల్లాపము లేమి ? ఈవిరహము లేమి ? ఈ
విలాపము లేమి ? తనకింత యుబ్బులాట లెందుకు? ఇంత
యుత్సాహ మెందుకు ? ఇదివఱ కెప్పు డాఁడుదాని మొగ మె
ఱుఁగఁడా? తాను ఘోటకబ్రహ్మచారియా ? ఈయుద్రేకము
నీయుత్కంఠయే నా కఱకాలిమంట బ్రహ్మరంధ్రమున కెక్కిం
చుచున్నది. ఒక్కసారి చూచిన నాటకము తిరుగఁ జూడఁగ
నంతయుత్సాహ ముండదే. దానికి క్రొత్తగాని తాను పదునా
ఱేండ్లు పాడినపాటయేకదా ? తనకింత పట్టరానితన మెందుల
కో ! ఇంతయెగుఁబులాట లెందులకో ?

పద్మ—పార్వతీ! ఎంత చెమ్మట పోసినదో. ఈపైఁటను దీసివైచి నీకు విసరెదను. (తీసివేయఁబోవఁగ పార్వతి యడ్డుకొనును.) అబ్బ! చెప్పినమాట విను. (పార్వతి జాఱుచున్నపైఁటతోఁ బ్రక్కగదిలోనికిఁ బోవును, పద్మనాభశాస్త్రికూడఁ బోవును.)

స—ఇద్దఱు గర్భాధానపుగదిలోనికే పోయినారు! వేసవికాల మగుటచే గదిలోఁ బండుకొన లేమని పంచపాళిలోఁ బ్రక్కవేయించుకొని యిక్కడియుడుకు సహింపలేక దీనిని దప్పించుకొనఁ దలఁచి యింతకంటె నుడుకుగల స్థలములోనికిఁ బోయినారు. ఒకకష్టము సహింపలేక, యాకష్టమును దగ్గించుకొనుటకు వేఱొకసుఖమార్గము నవలంబించి యామార్గములో నున్న కష్టమునుగూడ సహింపలేక దానిని దప్పించుకొనఁదలఁచి మఱింతకష్టపరంపరలోఁ బడుట మనుజుని నైత్తివ్రాఁతయే కాదా? కాని యీగదిలో నేమి జరుగుచున్నదో చూచుటకు వీలులేదు. నేను బోయి పండుకొందును. మనసు మిక్కిలి కలఁతనొంది యున్నది. తొందరపడకుండ నిదానించుకొని యేమి చేయవలయునో చూతును. పోయి పండుకొందును. నిద్రమాట యసత్యము.

(నిష్క్రమించును.)

ఇది ద్వితీయాంకము.

శ్రీరామా!

# సరోజిని.

## తృతీయాంకము

ప్రదేశము—పద్మనాభశాస్త్రియిల్లు.

ప్రవేశము—పార్వతి, సరోజిని.

స—పార్వతీ! ఇంతే—నేను చెప్పినదేమి? నీవు చేసిన దేమి?

పా—నేను జేసిన తప్పేమి?

స—మొదటిరాత్రి యట్టిసేపు భర్తయొద్ద నుండఁగూడదు, కొంతసే పుండి రమ్మని నేను నీతోఁ బదేపదే చెప్పలేదా?

పా—నేను రావలయు ననియే యూహించితిని, ఎన్నిసారులో ప్రయత్నము చేసితిని.

స—అటులైన నేల రాలేదు?

పా—అత్తా! నన్ను క్షమింపుము.

స—నేను క్షమించుట యెందులకే? నీవు నీభర్తయొద్ద నెంతసే పుండినను నాకు సంతోషమే. ఎంత నీభర్తయైనను, నీకు నీమగనియం దెంత యనురాగమైనను నూరిణాటిసంగతి రవంత చూడనక్కఱలేదా? తెల్లవాఱిన దాఁక మగనిని కౌఁగిలించు కొని పండుకొనిన దనియు, నెమిదిగంటలప్రొద్దెక్కినలేచు

వాతఁ గ్రొత్తపెండ్లికూతురు కన్నులు నులుముకొనుచు నీవల కటునిటు తూలుచు వచ్చిన దనియు చెఱువుదగ్గఱ నున్న యమ్మలక్కలందఱు బుగ్గలు నొక్కుకొనుచున్నారు. తుంట్లు చఱచుకొనుచున్నారు.

పా—అత్తా! ఈసంగతి యప్పుడే యూరివారి కెట్లు తెలిసినది?

స—ఎట్లు తెలిసినదా? గర్భాధానపువింతలు కాకి చెప్పును— గాలి చెప్పును. మనదాసి చెఱువుగట్టునొద్ద నంట్లుతోముచు విని వచ్చినాతోఁ జెప్పినది. "కుఱ్ఱవానికి, పాపము, తెలియదు కాఁబోలు" నని కొంద అన్నారఁట. "తెలియకపోవుటయేమి. ఇంటిలోనున్న నూకాలమ్మయంత సవతి చెప్పకయుండునా?" యని కొంద అన్నారఁట. 'ఈకాలపుఁబిల్లలు చెప్పినమాట వినరమ్మా, వారికెంతసేపు సింగారము, పడుకగది, పట్టెమంచము, మగఁడే కాని, మంచి చెడ్డ, పెద్ద పిన్న, హద్దు ఆజ్ఞ— యనున వేవియు లేవమ్మా' యని కొంద అన్నారఁట. 'పిల్లదానిదోష మేమియు లేదమ్మా. రెండవపెండ్లివాని కతిమూత్రిపురోగి యాఁకలిలాగున నుపయోగము లేని మమకార మధికమమ్మా-అముండకొడుకే,కోఁతిగొబ్బెరకాయవలెదానిఁ బట్టుకొని విడిచినాఁడు కాఁడమ్మా' యని కొంద అన్నారఁట. 'ఈదెబ్బతో సరోజినమ్మకు క్షౌరమే' యని కొంద అన్నారఁట. 'బుద్ధిపూర్వకముగఁ దెచ్చుకొన్నప్పుడు క్షౌరముతో నాగునా, గొంతుకోఁతవఱకు రాకపోవునా' యని కొంద అన్నారఁట. పరమేశ్వరా యని నడవలోఁ బైట పక్కగాఁ జేసికొని పండుకొన్న నాచెవులకే యీరవ్వ—యీరాయిడి?

పా—నాయందు దయయుంచుము. నాదోష మేమియు లేదు.

స—భర్త విడిచినాఁడు కాఁడా. (తనలో) భర్త విడిచినాఁడు కాఁడేమి? తనకొఱకు నాశ్లాఘ్యమును విడిచితినే—ఊరివారు నన్నుఁ దిట్టుదు రనుసందేహమును విడిచితినే. బంధువులలోఁ దల వంపు లగు నను భయమును విడిచితినే. ప్రత్యంశమునకు నాకాలికి సంకెల, నాచేతి కరదండము గలుగు ననుచింత విడిచితినే. నాయెడలఁ దనకున్న ప్రేమము పోవునేమో యను జంకు విడిచితినే. అట్టినాయెడలఁ దా నిట్లు ప్రవర్తించి నా కూరివారిచేతఁ గేళఖండనము, గొంతుకోఁతవఱకుఁ దెప్పించునా? నామనస్సు నొచ్చునేమో యని రవంత యాలోచించెనా? ఆపట్టునుండి తెల్లవాఱినదాఁక నే నాకపగ లెల్లఁ బడుకొనఁగూడదా? నేను నాసవతితోఁ జెప్పినమాటను, న్యాయమైనమాటను—వినవల దని నాసవతికిఁ దాను బోధించునా? గడివిడిచి రాకుండ దానినిఁ బట్టుకొనునా? నాకోడలికి నాకు నిప్పటినుండియుఁ గలహములు పెట్టి తాను దానితోఁ జేరి నామీఁద దాడివెడలునా? హుఁ. చూతము.

పా—అత్తా! ఏమి యోజించుచున్నావు?

స—నే నింటిలోఁ బెద్దదాన నున్నా నన్నసంగతి నీ వెఱుఁగుదువా? ఊఁ. అతఁడు నీ కాఱునెలలమగఁడేకాని, నేను నీకుఁ బదునూఁడేండ్ల మేనత్త నని యెఱుఁగుదువా? నన్నుఁ బట్టి నిపిటకు వచ్చితి వని తెలియునా? నీకుఁ బెండ్లియైన పిమ్మటఁ గూడ పలమ్ము మొఱ్ఱో యని యేడ్చుచుండ నాకీపెండ్లిచేసినా వని న న్నాతఁడు. నిన్నమధ్యాహ్నమువఱకుఁ గోసికొని తినిన సంగతి లోక మంతయు నెఱిఁగినదేనా? నిన్ను నీభర్తను బనుపుమైఁ గూర్చుండఁ బెట్టి, [illegible] పెట్టెది, పూలదండ్లు నా

డించి, పేళ్లు చెప్పించి యెన్నియో వేడుకలు చేయించుకొన
వలయు నని నే నెంతో యుబ్బులాటపడఁగఁ దన కది యప్ర
తిష్ఠ యని నా వేడుక లన్నియు సున్న చుట్టించిన యాతఁడు సి
ద్ధాయన యే యని యెఱుఁగుదువా ? ఇన్నియు నెఱిఁగియుం
డియు నింక తెల్లవాఱునదాఁక రాకపోయితివా ?

పా—అత్తా ! నేను బుద్ధిపూర్వకముగ నుండలేదు.

స—కొత్తరైక కుట్టుకొన్నప్పుడు రవంత పసపుకుంకుము దానికి
రాయుదుమే ? కుత్తికంటు పాఁతదైనను గ్రొత్తగా గ్రుచ్చు
కొన్నప్పుడు, పసపని, పండ్లని, కుంకుమని కుసుమములని,
ముహూర్తమని ముత్తైదువులని రవంత వేడుక చేసికొందుమా ?
అంతివఱ కెందులకు ? క్రొత్త పొయ్యి వేసికొన్నప్పుడు దాని
మీఁద నాల్గు మంగళాక్షతలు చల్లుదుముకదా ! అట్టిచో
నూఱేండ్లు, చిలువలతోఁ బలువలతోఁ బూలతోఁ గాయల
తోఁ బండ్లతో వర్ధిల్లవలసిన పెండ్లికూతుముహూర్తపుగది
యయ్యవారినట్టిల్లులాగున శుద్ధమోక్షముగఁ జేయునా ? త
ప్పుగఁ దోఁచుటలేదా ? మంగలికిఁ బొదిపూజ యున్నది, చాక
లికి బల్లపూజ యున్నది, కోమటికి గల్లాపెట్టెపూజ యున్నది.
రాజున కాయుధపూజ యున్నది. వేశ్యకు గజ్జెలపూజ యున్న
ది. నీయాయన కేదియు లేదు. సర్వము శూన్యము.

పా—అత్తా ! ఏదో జరిగిపోయినది, పోనిమ్ము. ఆయన కేసందేహా
ముచేత వేడుకలు మానినారో.

స—భర్త నప్పుడే సమర్థించుచున్నావా ? నీమాతృపితృభక్తి నా
కున్నది. నిన్న వచ్చిన నీవు నాకీవయస్సులోఁ బతివ్రతాధర్మ
ములు చెప్పనక్కఱలేదమ్మా. నుగఁ దనఁగా నప్పనే యుంట

వ్రాసికొనివచ్చుచున్నావా ? నీకుఁ దగినవేడుకలు జరుగక
పోయెనే యని నేను దేవులాడితిని గాని నీభర్తను నిందింప
లేదమ్మా. ఈమూఁడురాత్రులు పూర్తియైనపిమ్మట మీ రిద్దఱు
పాయపడి న న్నాతల కీడ్చివేయుదురా యేమి ?

పా—అత్తా ! అదేమి ! అదేమి ! నీవంతకఠినముగా మాటలాడెద
వేల ? నేను దప్పాడినట్లు నీకుఁ దోఁచునెడల దయయుంచి
క్షమింపుము. నే నెట్టి దానవో పూర్తిగ నీ వెఱుఁగవా ?
నీమాట కెన్నఁడైన నెదురాడితినా ? పెద్దల నెప్పుడైన మన్నిం
పకుంటినా ? ఎన్నఁడైనఁ దగవులలో దిగితినా ? పరిహాసమున
కైన నెవ్వరినైన నిందించితినా ? అసత్య మాడితినా ? ఒక్క
దినమైన భగవంతునిఁ బ్రార్థించుట కుపేక్షించితినా ?

స—ఇంత మంచిదాన వని యెఱిఁగియుండఁబట్టియే నీవు నామర్యా
దను, గౌరవమును బెద్దతనమును గాపాడుదు వని నమ్మియుం
డఁబట్టియే నిన్నిటకుఁ దెచ్చుకొంటిని. కోరికోరి, పోరిపోరి
భర్తకు సవతిని సమకూర్చిన దెవ్వతె యైన నుండునా ? ఎం
దుల కిట్లు చేసితిని ? వంశము నిలువఁబడలే దని యేడ్చుచే
నిట్లు చేసితిని. నాయంత ధర్మాత్మురాలిని, నాయట్టి న్యాయ
శీలను, నాయట్టి పతిసేవాతత్పరను మఱియొకతె నీకాలమునఁ
జూపఁగలవా ? ఇప్పటియాఁడువారిస్థితి యెట్లున్నదో నీ వెఱుఁ
గకున్నావా ? సర్వస్వాతంత్ర్యవాంఛ సంపూర్ణముగా నున్నది
కాదా ? స్త్రీకిఁ బురుషునకు స్వతంత్రతలో నెంతమాత్రము
భేద ముండఁగూడ దని యిప్పటి వారిలోఁ గొంద ఱనుచు
న్నారు. భేద మెంతమాత్రము లేని మాట నిశ్చయమే—స్త్రీకిఁ
బురుషునకు ధర్మనిర్వహణమం దెంతమాత్రము భేదము లేదు.

గృహస్థాశ్రమపవిత్రతను నిలువఁబెట్టుకొనుటకు, దానధర్మ
ములు నిర్వహించుటకుఁ బురుషున కెంత స్వతంత్రతయో స్త్రీ
కంత స్వతంత్రతయే యున్నది. బంధుసేవ, యతిథిపూజ, యతి
భిక్ష, గృహదేవతార్చన మొదలగు సర్వసాంసారికకృత్యము
లందును భార్యాభర్త లిద్దఱు సమానస్వతంత్రులు. అంతే
కాని, నీవు తల కత్తిరించుకొనిన యెడల నేనును గత్తిరించుకొం
దును, నీవు చుట్టఁగాల్పఁగ నేనును గాల్తును, నీవు తూర్పు
వీథికిఁ దిరువీథులు వేంచేయఁగ నేను బడమటివీథికేగెదను,
నీకు నాకు నీతిక్రమములో సమానాధికార ముండవలయు
నన్న స్వాతంత్ర్యము స్వాతంత్ర్యమా? మగవాఁడు—ప్రకృ
తిచేఁ జంచలుఁడైన మగవాఁడు—జూదగాఁడై, త్రాగుబోతై,
పరకాంతల పైఁటచెఱఁగులఁ బట్టుకొని పరగడలు త్రొక్కు
చుండ, సంసారప్రతిష్ఠఁ గాపాడుకొనుటకు, భర్త కుద్గతిని సమ
కూర్చుటకు స్వతంత్రురాలగు నాఁడుది యేమి చేయవలసిన
దనఁగా—భర్తను జెవిపట్టుకొని యింటికి గీడ్చుకొనివచ్చి,
యీలెంప నీలెంప వాయించి, గృహదేవతలకు మ్రొక్కించి
యాతని బాగుచేయవలయును గాని 'నేనుగూడ మర్యాదను
విడిచి కట్టుత్రాడుఁ దెంపుకొని పరుగెత్తుదు' ననుట యున్మా
దముకంటె భిన్నమా? ఇచ్చట వంశపవిత్రతఁ గాపాడుకొను
టకు నక్కడ సద్గతి నొందుటకుఁ జేయవలసిన సర్వవిధులందు
దంపతులకు సమానస్వాతంత్ర్యము భారతదేశమునం దుండనే
యున్నది. ఎప్పటినుండి? హిమాలయ మున్నప్పటినుండి యు
న్నది. ఇప్పటివారివలెఁగాక నే నట్టిపూర్వకాంతలవంటిదా
నను. నావలన నీభర్తకు వంశము లేకపోయె నని చింతించి

వంశము నిలువఁబెట్టుకొనుట భర్త కెంతవిధియో భార్యకుఁ గూడ నంతవిధియే కావున నీభర్తకుఁ దిరుగ వివాహ మొనర్చి భర్తృభార్యాస్వతంత్రతాసమానత్వమును లోకమున కెల్లు వెల్లడించితినో చూచితివా ? ఎటువచ్చినను నేను గొంతతీవ్ర స్వభావను. కాని నే నొకరిని బాధించుదానను గాను. కాని నన్ను నొప్పించినయెడల నే నెవ్వరికైన బాధ నిచ్చుటకు జంకు దానను గాను.

పా—అత్తా ! ఇన్నిమాట లేల ? నేను నీమనస్సు నెట్లు నొప్పింతు ననుకొంటివి ?

స—నామాట వినకపోవునెడల—

పా—భర్తమాటఁగూడ వినవలయునుగాదా ?

స—ఆఁ. ఆఁ. భర్తమాట వినవల దని నే నంటినా ? భర్త నీకేకాని నాకుమాత్రము కాఁడా ? అప్పుడే నానుండి భర్తను వేరుచే యుచుంటివా ? నీకు భర్తయొక్కటియు నే నొక్కటియునా ? నే నేనాఁటిదానను నీకు భర్త యేనాఁటివాఁడు ? ఆసంగతి నీ వాలోచించుకొననక్కఱలేదా ? నీవు నీభర్తను బట్టి యిచ్చ టికి వచ్చితివా ? నన్నుఁబట్టి వచ్చితివా ?

పా—నిన్నుఁబట్టి వచ్చినను భర్తకొఱకే వచ్చితినిగాదా ? నీ వైనను నన్ను భర్తకొఱకే తెచ్చితివికాదా ?

స—కాదు—ప్రధానముగ నాకొఱకే తెచ్చితిని. మఱియొకతె వచ్చి నయెడల నామాట సాగ దనియే నిన్నుఁ దెచ్చితిని. భర్త యొద్దఁ బండుకో. బిడ్డలను గను. నీవు చెప్పిన ట్లంత కొఱకే నీభర్త కాని శేషించిన దంతయు నాకొఱకే కాదా ?

పా—అత్తా ! నా కేమియుఁ దెలియదు. చిన్నదానను. దిక్కులేని

దానను. నిన్ను నాతల్లివలెఁ జూచుకొనుచున్నాను గాని మఱి యొకలాగునఁ జూచుకొనుచుండుట లేను. నీ విట్లు నడచు కొను మని నన్ను దిద్దుకొనుము. నేనింతకంటె నేమి చేయఁగ లను ? (తనలో) ఓభగవంతుఁడా ! న న్నీయింట నెందులకుఁ బడవైచితివోయి తండ్రీ !

స—ఓసి వెఱ్ఱిదానా ! అట్లు దైన్యపడుదు వేల ? నీ కేమియుఁ గష్టము లేదు. నేను జెప్పిన మాటమాత్రము వినుచుండుము. అం తయే కావలసినది. చూడు—పార్వతీ ! పనికిమాలినగొడవతోఁ గాలక్షేపమైనది. నిన్నరాత్రి నీతో భర్త నన్నుఁగూర్చి యే మైన ననివాఁడా ?

పా—నీయత్తయే నిన్ను సింగారించినదా యని యడిగినాఁడు.

స—అంతే. అంతకంటె నేమియు నడుగ లేదా ?

పా—లేను.

స—నీసింగారము బాగుగ నున్న దని ప్రశంసించినాఁడా ?

పా—లేదు.

స—నీవు చాలఁ జక్కగా నున్నా వని నిన్ను గొనియాడినాఁడా ?

పా—నా చెక్కిళ్ళనుగూర్చి యేదో యన్నాఁడు కాని నాకుఁ దెలి యలేదు.

స—(తనలో) దాఁపకుండ సరిగనే చెప్పుచున్నది. (ప్రకా) నీవు తిన్నగా సుఖపడినావో లేదో యని యడుగుచున్నానమ్మా. పెండ్లి వల దని భీష్మించుకొన్న యయ్యవారు కాన, గదిలో నిన్నుఁ జూచి చిఱ్ఱుబుస్సు మన్నాఁడో కాక కునికిపాట్లు పడి నాఁడో యని యడిగితినమ్మా.

పా—అట్లు చేయ లేదు.

స—పోనీ ! అమ్మా ! ఉబలాటమునకు నుత్సాహమునకు నేమియు లోపములేదుకదా ?

పా—ఊహుం !

స—(తనలో) హుం ! వయస్సునకు మారువడి కలిగినది. ఏదు తెమ్ముచున్నది. ఆహాహా ! ఎన్నిచదువులు చదివినసరే—ఎంతకాలము చదివినసరే కాని—మగవాఁడు—ప్రాయమున్న పెండ్లాము వచ్చుసరికిఁ దిరిగి యోనమాలయొద్దకు జఱ్ఱున దిగఁజారును. దినములు దొరలించుకొనిపోవలసినయిట్టిస్థితిలో, నీవయస్సుతోఁ దిగఁ గొత్త పెండ్లికొడుకునకువలె ముదుపులు—బులుపులు నా ? సిగ్గుండనక్కఱలేదా ? ఆఁడుదానిమొగ మెఱుఁగని శుష్కబ్రహ్మచారి యెన్నిలొట్టలు వేసినను సహజము. అంతే కాని కడుపు గిఱ్ఱుననిండినవాని కీనోరూరుట లెందులకు ? ఈ పనికిమాలినవికారములు కలుగకుండ సంసారము జరుపుకొనఁ గూడదు కాఁబోలు ! భరతవాక్యము సమీపించినప్పుడు నాందీ పుష్పాంజలియా ? సాయంసమయమున భరతపక్షికూఁతయా ?

పా—అత్తా ! సాయంకాల మగుచున్నది.

స—వంటకు మడికట్టుకొనుటకేనా? అదియే చూచుచున్నాను. దిక్కుమాలినప్రకృతి కిదేపని. సూర్యోదయముతోను, సూర్యాస్తమయముతోను సరిపోవుచున్నది. ఒకరినెత్తిని సూర్యాస్తమయము. ఒకరినెత్తిని సూర్యోదయము. ఒకరిమొదాన దుఃఖము. ఒకరిమొగాన సుఖము; ఈరీతిగా నర్థము భావము లేని ప్రపంచము దొరలిపోవుచున్నది. ఎవరు చచ్చినను దానిపని యది మానదు. ఎప్పుడో మనము గుదుర్కొనునవఱకు దీనిబాధ

మనకు వదలదు. ఇదిగో పోవుచున్నానమ్మా- కూరగాయ లేమో చూచుకోవలదా ?

పా—అత్తా ! నాకు జడవేసి మఱి వెళ్లరాదా ?

స—వంటయింటిదేవులాట నాకు- పడుకటింటిదేవులాట నీకు- పడుక లేకపోయినను వంట నాకుఁ దప్పదు. వంట లేకపోయినను పడుక నీకుఁ దప్పదు. ఇఁక నీభర్తకు నావంట కావలెను— నీపడుక కావలెను. ఏమోనమ్మా ! ఇన్నియేలాగున జరుగునో నాకుఁ దెలియదు. ఒకపూట తిండిలేకపోయిన నుండలేము కాని యొకరాత్రి పండుకొనకుండ నుండలేమా ? అది యక్కడ నిదియిక్కడఁ జూచుటకు నాకేమి పదిచేతు లున్నవా? అమ్మా ! ఈరాత్రి నాతోపాటు నీవిక్కడనే పండుకొందువుగాని తల్లీ ! నిన్నరాత్రి యొక్కటెను బండుకొనలేక పోయితిని. తెల్లవాఱినదాఁకఁ బీడకలలే. అమ్మా ! నా యొద్ద నీ వెప్పుడో మూఁడేండ్లకిందఁ బండుకొంటివి. పెంచిన మమకారముచే నిట్లు దేవులాడుచున్నాను. ఏమి మాటలాడవు ?

పా—నీ—యి—ష్ట—ము.

స—అంత దిగులుపడెద వెందులకే ? నీకు నీభర్తతో మైత్రి యొక్కరాత్రిదే కాదా ? నామైత్రి పదునాలుసంవత్సరములది. నీకే యింత దిగు లున్నప్పుడు, నా కెంత యుండవలయునమ్మా.

పా—అత్తా !

స—ఆఁ. ఎందులకు ?

పా—అబ్బే ! ఏమియు లేదు.

స—ఏమియు లేకపోవుట కాదు. నీసందేహ మేమో చెప్పుము.

చెప్పినమాట యేల వినవలయు నన్న సందేహమేనా ? అంత కంటె నేమైన నున్నదా ?

పా—రామరామ. ఆసందేహమే కాదు. రెండవరోజు మానఁగూడ దని యుందురుకాదా యని—

స—అది మొదటిపెండ్లిమాట కాని రెండవపెండ్లిమాట కాదమ్మా- రెండవపెండ్లి యొకపెండ్లిలో లెక్క-కాదమ్మా-ఇది యొక్క- కక్కుఱితి యేర్పాటు. దేహయాత్రకొఱకు-దినము వెడల బుచ్చుకొనుటకు-ఇంటినిండుకొఱకు-చేయి కాల్చుకొనకుండుట కొఱకు-పైసంచారాల పరిచ్ఛన్నతకొఱకు- ఆలి యాటవస్తు వగుటకొఱకు-అధికారము కనఁబఱచుటకు-వ్యత్యాసము జరు గునెడల పూర్వయౌవనములోనే ముసుఁగువేసికొనుటకు-అం తేకాని మొదటిపెండ్లికున్నంత యాశ్రిమార్గత, యాముష్మికా ర్గత-దీనికెక్కడివి? అన్నముదొరకకపోయినప్పు డడుకులు నమ లినట్లు కప్పుకొనుటకు-కాశ్మీరరాంకవము లేనప్పుడు చలిమంట వేసికొనినట్లు-భోక్తలు దొరకనప్పుడు చటకము చేసినట్లు-అం తేకాని యంతకంటె భిన్నమా? నీపెండ్లికి ముహూర్తము కుదు ర్పు మని నాపామరత్వముచే నేనడుగ రెండవపెండ్లికి ముహూర్త మెందుల కని నీభర్త తృణప్రాయముగాఁ బలికి నాఁడు. అది చుట్టగాల్చుటవంటిదో, పొడుము బీల్చుటవం టిదో యని నీభర్తయభిప్రాయము. నే నసత్యమాడితినేమో నీభర్త నడుగరాదా ?

పా—ఎవ్వరి నడుగనక్కఱలేదు. అత్తా ! ఇట్టిపనికిమాలినపెండ్లిని నీ భర్త కేల చేసితివి. నన్నుఁగూడ నిందేల దింపితివి ?

స—అట్లనవచ్చునా. అమ్మా. లోకాచారము మానుకొనుట కెవరి

తరము ? మంచియో చెడ్డయో లోకము ననుసరించి పోవలసినదే. నీనాఁడు నానాఁడుఁ బుట్టినలోకమా- అమ్మా- అదిగాక మనవెత్తిఁబ్రాఁత యెంతో జరుగుచేఁత యంతే- నీభర్తను నిన్ను మహాకూపమున దింపినా నని నన్నేల నిందింతువు? మీకర్మమే మిమ్ము దింపినది కాని యెవ్వరు దింపలేదమ్మా! ఈకలికాలములో దింపిన దిగువా రెవరమ్మా ? వారు వీరు చేసినారని యేదో వెఱ్ఱిభ్రాంతి. ఎవని గొంతుత్రాడు వాఁడే పేనుకొనుచున్నాఁడు. పరమార్థము తెలియకపోవుటచేఁ బైవారికిఁ దిట్లు. నీవు నీమగఁడు సుఖముగానే యున్నారు. ఇంకను సాయంకాలము కాలేదేయని నీవు విలవిలలాడుచున్నావు. అప్పుడే తెల్లవాఱిపోయెనే యని యతఁడు తహతహలాడుచున్నాఁడు. శృంగారసంబంధము లగు మీలబలబలు, సౌఖ్యసంబంధము లగు గుబగుబలు కాని వేఱుకావు. రనంతసేపు పలుస్సు హాస్సని మీ రన్నను దెల్లవాఱినదాఁక మహానందమునఁ గులుకుచున్నారు. ఎటువచ్చినను హాహాహూహూ రని శాశ్వతముగా నేడువవలసినదానను నేను. దైవముఖమును జూచి, ధర్మమునకుఁ గట్టుపడి నోరుమూసికొని నే నున్నను ‘ వంట కాలే దేమి ’ యని యాతఁడు, ‘ జడవేయలే దేమ’ని నీవు నన్నుఁ దిట్ట ?

పా—అత్తా ! నిన్ను నేను బల్లెత్తుమాట నందునా ? ఎంతమాట! నేను నిన్ను విధేయనై సేవించుటకంటెఁ జేయవలసినదేమున్నది?

స—చేయకపోయినను జేసినంతమాట యంటివి !

పా—చేయకపోవుటకూడనా ?

స—చేసిన దేమున్నదే? అత్తగారు వంటకు లేవఁబోవుచున్నదికదా,

చెప్పిన నూతియొద్దకుఁ బోయి నాల్గుబిందెలు నీళ్ళు తె
రవాతి యంట్లు తోలఁచి, వంటయిల్లు కొంతయూడ్చి, నిప్పు
చేసి, బియ్యము కడిగి, కూర తరిగి, దీపముపెట్టి యేదో నాకు
సాయము చేయవలసినదానవు కదా- కూరుచుండుచోటినుండికద
లినావా? పోసి! ఎవ్వరిసాయ మక్కఱలేదని నేనుబోఁబోవుచుం
డఁగా, నాకు జడవేసి మఱి కదలుమ'ని నన్ను నిరోధించితివి
కాదా? నీమగఁడు కాశికిఁ బోవునా, నీవు రామేశ్వరము
పోదువా? రేపు వండుకొనఁగూడదా? నూతేండ్ల కాపురము
కదా. ఈరాత్రితోఁ దీరునా?

పా——అత్తా! నన్ను క్షమింపుము. నేఁ బోయి యన్నియు సిద్ధపఱ
తును. (నిష్క్రమించును.)

స——ఈకుఱ్ఱది నే ననుకొన్నంత మెత్తగ లేదు. దైవభక్తి గలదిమాత్ర
మగును. దైవభక్తియందు దీక్షగలదానికి మనుష్యులభయము
సాధారణముగా నుండదు. అందుచే నన్ను లక్ష్యము చేయ
దేమో యని భయముగా నున్నది. అదిగాక భర్తయందు దీని
కనురాగ మున్నట్లు స్పష్టము. అనురాగమున కేమి—కొత్తలో
నందఱ కుండును. భర్తపై భక్తిగూడ నున్నట్లున్నది. భర్త
మాట వినవలదా యని నన్ను స్పష్టముగ నడిగినది. భర్త
మాట వినకున్న యెడలఁ బాప మేమో యని సంశయించు
చున్నది. పిన్నగాక మొన్నటికుఱ్ఱది. తనకు భర్తపై నప్పుడే
భక్తియేమి? తన మొగము. అదిగాక ముఖ్యముగా నాతఁడు
నాభర్త యైనప్పుడు తనకాతనిపై నంతభక్తి యెందులకు? దానికి
నాపై భక్తి యుండు నెడల, భర్తయు, నేను నొక్కటియే
కావున, భర్తపై నున్నట్లే. ఇది నాకుఁ జేటుకువ గాకున్న యె

డల భర్తకు నాపై నున్న యనురాగము నశించును. నాపతికి దీనితో సంబంధము సాధ్యమగునంతవఱకుఁ దగ్గింపవలయును. వెనుక నాపతి నాతో నున్నపద్ధతిలో నెంతమాత్రము భేదము రాఁగూడదు. కొడుకుఁ గనుటకొఱకుమాత్రమే కట్టుకొన్న కుఱ్ఱది. కావున నాకుఁ దీఱికలేనప్పు డాతనితో రవంతమాట లాడ నిచ్చెదను. ఆమాత్రమునకే సంతానము కలుగఁగూడదా ? అది దైవకటాక్షఫలము కాని మఱియొకటి కాదు. అట్లే కానియెడల పదునాఱేండ్లనుండి నిరంతరము పతిని భగవంతునివలె సేవించుచున్న నాబ్రదు కిటు లేల కావలయును ? ఇంతకుఁ బ్రధానమైన దేమనగా, నామగడు నాకొక్కతెకే మగఁడుగా నుండవలయును. కాని యీయుదయమున నాపతి నాతో మాటలాడలేదు. సాయంకాలమైనదా—ఇప్పటికి మాటలాడలేదు. రాత్రి యాతఁడు గదిలోఁ గానఁబఱచిన విలాసములు చూడఁగా నతనికి దానిపై నుబలాట మెక్కువగానే యున్నట్లు కనఁబడుచున్నది. కాని యది తాత్కాలికము కావచ్చును. నేను గొంతతొందరపడుచున్నా నేమో యని నాకే సందేహముగా నున్నది. పిల్ల నేమాత్రము బెదరఁగొట్టఁగూడదు. అది భర్తలోఁ జేరిపోవు నెడలఁ బ్రమాద మున్నది. కాని యీరాత్రి దానిని గదిలోనికిఁ బంపను. నాభర్త యేమిచేయునో చూతును. ఇది యెట్లు పరివర్తించునో చూతును. అప్పటి కేదో యొకదారిఁ ద్రొక్కుదును. అంతవఱకుఁ దొందర పడక యుండెదను. వంటకు వేళ దాఁటినది. పోవుదును.

(నిష్క్రమించును.)

ఇది తృతీయాంకము.

శ్రీరామా!

# సరోజిని.

చతుర్థాంకము

ప్రదేశము—పద్మనాభశాస్త్రియింటిలో వేఱొకగది.

(రెండుమంచములు దగ్గఱగా నుండును.)

ప్రవేశము—సరోజిని- పార్వతి- మంచములపై.

స—వంకాయకూర బాగుగ లేదఁటే.

పా—ఆః బాగుగలేకేమి. నిక్షేపములాగున నున్నది.

స—నీ కాకూర యిష్టమని నే నెంతో ముచ్చటపడి చేసినప్పుడు నీవు దానిని ముట్టుకొననైన లేదేమి ?

పా—అత్తా! ఈవేళ నాకాఁకలి మందముగా నున్నది.

స—మనసు మందమైనప్పుడాఁకలి మందముగానే యుండునమ్మా. అంత బెంగపెట్టుకొని నీవు నాయొద్దఁ బండుకొనుట యెందు కలకు ? గదిలోనికిఁ బోయి మగనియొద్దఁ బండుకొనుము. అమ్మా! తలదువ్వుకొనకపోయిన నేమి? జడ వేసికొనకపోయిన నేమి ? పూలు పెట్టుకొనకపోయిన నేమి?— రవంత సేపటిలో జడ నతిగిపోవును. పూలు వాడిపోవును. ఈమాత్రిపుసింగారము చేసికొన్న నేమి— చేసికొనకున్న నేమి ?—

పా—అత్తా! అట్లు చెప్పుచున్నావేల? రవంతసేపటిలో నరిగిపోవు
నని యన్నముతినుట మానినామా?

స—ఎగసుతిరిగి నాతో వాగ్వాద మారంభించినావా? అన్నము
కేవల మావశ్యకపదార్థము. అది లేకున్నయెడలఁ జత్తుము.
జడవేసికొనకున్నచోఁ జచ్చునెడల భూమండలములో బోడి
ముండయే యుండకపోవలెను. పూలకు భోజనమునకు సామ్య
ముఁ జెప్పితివా? బుద్ధిమంతురాలవు. రేపటినుండి వాట
యింటిలోనికి రాక పూలగంప నెత్తిని బెట్టుకొని పడకగదిలోఁ
గూర్చుండుము. ఇన్నిమాట లెందులకు- పో పార్వతీ! గదిలో
నికిఁ బో. నీకంతకష్టముగా నున్నప్పుడు నాగొంతుమీఁద
నెందులకు?

పా—అబ్బే! నేను వెళ్లను. ఇక్కడనే పండుకొందును.

స—ఒసే! ఈమాత్రమునకు ముక్కుముక్కు ముక్కలైపోవుచున్నావు.
ఒక్కరాత్రి గదిలోనికిఁ బోకుండ నుండలేవేమి? తలనొప్పి
వచ్చినదనుకో. ఏమిచేయుదువే? జ్వరము వచ్చిన దనుకో-
ఏమిచేయుదువే? పోనీ జబ్బని యనుకొనుట యెందులకు?
ఆఁడువారి యాటంకము వచ్చినదనుకో- ఏమిచేయుదువే?
పాపము మామేనత్తకూఁతురు మొదటిరాత్రి గదిలోనికి వెళ్లి
నది. అట్టె యీవలికి వచ్చి వాఁకిటిలో మూఁడురోజులు కూ
ర్చుండినది. ఏమిచేయవలసినది? అది నీలాగుననే గోల పెట్టి
నదా? పార్వతీ! ఇవన్నియు సాగుచుండుటవలనఁ బుట్టినతెగనీ
లుగులు. నావలె వెఱ్ఱిపెద్దమ్మగాక గయ్యాళియత్తగా రెవతె
నైన నుండి నోరు మూసికొని పండుకోయని మూఁతిమీఁదఁ
బొడిచినయెడల నన్నిహాహాకారా లంతరించును. ఎక్కడికినీనికి-

ఈజరుగుఁగాటురోగాల కంతకంటె వైద్యము లేదు.

పా—అత్తా! అంతపని కక్కఱలేదు. నీయిష్టానుసార మిక్కడనే యుండును.

స—సరే. చేతులు నులుముకొనుచుఁ గూరుచుంటివి కాని రవంత కాలిపై రాయరాదఁటే.

పా—(అత్త కాళ్లు లొత్తును.) (తనలో) నాబ్రదు కెట్లు జరుపవలయు నని యోజించితినోయి తండ్రీ! ముందేమి యల్లరిపడవలయునో! ఎన్నికష్టముల నెదుర్కొనవలయునో భగవంతుఁడా! నీపాదసేవకురాలను. నీదయతక్క నేనేదియు నమ్మియుండ లేదు. నాయం దెంతో యనురాగముగల యీమె నన్ను సాధించుచున్నది. మగనియొద్దకుఁ బంపనప్పుడు నాకుఁ బెండ్లి యెందులకుఁ జేసెనో!

స—వ్రేళ్ళు లాగరాదఁటే. (పార్వతి అట్లు చేయును.) అబ్బ! అంత గట్టిగ లాగెదవేల? నామీఁదికోప మీవిధముగాఁ దీర్చుకొందువా యేమి? పార్వతీ! నీమగఁ డీయుదయమునుండి యిప్పటి వఱకు నీతో నెప్పుడైన మాటలాడెనా?

పా—ఊహుఁ.

స—నిన్నుఁ జూచి నవ్వినాఁడా? అసత్యమాడకు.

పా—కొంచెము నవ్వినట్లు యనుకొంటిని.

స—ఎందులకు నవ్వెనో నీకేమైనఁ దెలిసెనా?

పా—తెలియలేదు.

స—కారణ మేదో నీ వూహింపలేవా?

పా—ఊహుఁ.

స—నిన్నుఁ జూచి నవ్వినప్పుడు నీకుఁ గారణము తెలియకుండునా ? నీకుఁ దెలియును. నాయొద్ద దాఁచుచున్నావు.

పా—నిశ్చయముగా నాకుఁ దెలియదు.

స—నన్నుఁ జంపుకొని తినినట్లే?

పా—ఆ.

స—ఆతనినవ్వు చూచి నీవుకూడఁ గొంత నవ్వితివా లేదా ? ఊఁ. ఆమాట చెప్పు.

పా—(నవ్వుచు) అత్తా ! నీమాట వినుటచే నా కిప్పుడు నవ్వువచ్చుచున్నది.

స—రాదా అమ్మా! నాది పరిహాసాస్పదమైన బ్రదుకై పోయినది. లోక మంతయు నన్నుఁ జూచి వెకవెకలాడవలసిన స్థితిలోనికి దిగితిని. అమ్మలక్కలు బుగ్గలు నొక్కుకొనుచున్నను, తుంట్లు జటచుకొనుచున్నను నాకొఱకేకాదా ? నీవిప్పుడు నవ్వితి వని నా కేమియు విచారము లేదమ్మా. కాని నేనడిగిన ప్రశ్నమున కుత్తరము చెప్పలేకు. నీమగఁడు నవ్వినప్పుడు నీవు తిరిగి నవ్వితివా లేదా ?

పా—అత్తా! నాకు జ్ఞప్తిలే దమ్మా-

స—ఛీ! అసత్యమాడుచున్నావు. మనుజున కేడు పెంత జ్ఞప్తిలో నుండునో, నవ్వుకూడ నట్లే యుండును. మగఁడు కులికినప్పుడు నీవు కులుకక పోవుదువా ? ఒకరి నొకరు కన్నులతోఁ గౌఁగిలించుకొనుచున్నారా? మనస్సులతో ముద్దుఁబెట్టుకొనుచున్నారా? ఇట్టిస్థితిలో నీవుమాత్రము నీమగనివలె కులుకకుందువా ? నవ్వు పైవారిలోనే యంటురోగమైనప్పుడు భార్యాభర్తలలోఁ గాకుండునా ? నీవు తప్పకుండ నవ్వితివి. ఒప్పుకోరాదా ?

పా—ఔనమ్మా- నవ్వితిని.

స—ఆమాట స్పష్టముగ్గాఁ జెప్పరాదా? ఇంతదాఁపఱిక మెందులకు? ఇంతవెనుకాట యెందులకు? నేనింత గొడవచేసినఁగాని చెప్పఁగూడ దేమి? నీమన స్సగాధమైనది. నీవు నావలె బేలగుండె దానవుకావు. చూడు. ఈయింటిలో గృహిణిని నేను. ఈసంసారము నాది. నేను పెద్దదానను. వార్చి వడపోసినదానను. కష్టసుఖము లెఱిఁగినదానను. నేనింటిలో నుండఁగా మీరా గోడచాటున దాఁగుడుమూఁతలు— ఈతలుపుచాటునఁ గులుకులు—ఆసందుమూల సంజ్ఞలు—ఈకిటికిచాటున చిటికెలు— నాకుఁ బనికిరావు. మనము సంసారులము. సముచితముగా, సందర్భముగా నడిరాత్రివేళ బ్రహ్మకైనఁ దెలియకుండ మగనితోఁ జూపు నేల దాఁటకుండ, బలుకు పెదవి దాఁటకుండ, నవ్వు చెంప దాఁటకుండ రవంతసేపు కాలక్షేపముఁ జేసి గిరుక్కున మరలవలసినవారము. అంతేకాని పడుకటింటిలోను గిచకిచ లే, పంచపాళిలోను గిలకిల లే, కొట్టింటిలోను గుసగుస లే, గాదిచాటున లొట్టలే,— యీాకంతువికారపుగాడిదెగత్తరలు నాకుఁ బనికిరావు.

పా—అత్తా! నీయిష్టమువచ్చినట్లు దిద్దుకొనుమని యొక్కసారియే చెప్పితినిగాదా?

స—పెద్దదాననైన నేను మీానిరంకుశత్వము నిప్పుడే యడ్డుపెట్టకుండు నెడల—ఓ చెలరేఁగి, విజృంభించి, యూరెగిరిపోవునట్లు సంగీతాలు కాదు, సాహిత్యాలు కాదు, నాట్యాలు కావు, అభినయాలు కావు, చెంగ్లాటలు కావు, జెట్టిపట్లు కావు. మీరు వీథిగుమ్మములో నూరెగిరిపోవునట్లు, లింటియెదుట సంతసాగు

నట్లు మొదలుపెట్టుకుందురా? అందుచే నాయింటిశాంతి, స్వ
చ్ఛత కాపాడుకొనుట నావిధి. నీవు పగలెప్పుడు భర్తతో
మాటలాడఁగూడదు. నాకుఁ దెలియక యడుగుదువు? ఎందు
లకు మాటలాడవలయును? ఇంటిగొడవ, పొలముగొడవ,
పశువులగొడవ సంసారపుగొడవ నామీఁద వైచికొంటిని.
నీకు భర్తతో మాటలాడఁ దగిన దేమున్నది? భర్తకు పగలు
కనబడుటకూడ నాకిష్టము లేదు. కాని యసదుపాయమైన
బ్రాహ్మణగృహము కావున నందుల కంగీకరించితిని. కర్మము
చాలక కనఁబడినను నీ వాతనిఁ జూచి నవ్వఁదగదు. సంసార
ములో నవ్వులాటల కవకాశ మేమున్నది? వేళాకోళములకు,
వెక్కిరింతల కేమి పరిహాసన మనుకొంటివా? పరిహాసము
లకుఁ బిక్కచూపుల కిదేమి బోగమూట యనుకొంటివా?
సంసారజీవనములో స్వభావలాఘవ మెంతమాత్రము పనికి
రాదు. సంసారిణికి, వెకిలితనములు నిగిలింపులు తగునా?
నీ విట్లు నడచుచున్నావా యని నన్నధిక్షేపింతు వేమి?

పా—అత్తా! పెద్దదాన వైన నిన్నధిక్షేపింతునా?

స—అధిక్షేపింపఁ దలఁచుకొన్నవారికిఁ బెద్దపిన్న భేద ముండదులే.
నాచిన్నతనములో నే నెంత కట్టుదిట్టముగ నడచుకొంటినో
నీభర్త నడుగు. ఇరుగుపొరుగువారి నడుగు; కాలమైనపిమ్మట
నా కా కట్లెందులకు? పొట్లపిందెకు తాయిగాని పొట్లకాయకు
దా యెందులకు? ఇంతకు మఱియొక్కమాట చెప్పుచున్నాను
విను—గదిలోనుండి తెల్లవాఱుజామున రావలెనే కాని
జాముప్రొద్దెక్కినపిమ్మట నిక్కుచు, నీల్గుచు, నావులించుచుఁ,
జిటికెలువైచుకొనుచు వచ్చుటకు నే నొప్పుకొనను. అది మీ

కప్రతిష్ఠమాట యటుంపుము. ఇంటిలోఁ బెద్దది తా నున్నది కదా, రవంత చెప్పఁగూడదా? మందలింపఁగూడదా? యని యూరివారు నన్నుఁ దిట్టుదురు. అదిగాక రెండుజాముల వఱకు మీకొఱకు వంటయింటిలోఁ గనిపెట్టుకొనియుండి నాకు నడుమూక్కొనిపోవుచుండఁగా, మీకు నైవేద్యాలు పెట్టలేనమ్మా! నాకేమి యోపికయా? వల్లకాఁడా! వీరి యింటిలోఁ బడినదిమొదలు తెక్కలు ముక్కలైపోవుచున్నవి. అంట్లు తప్పెల లేలాగున నరిగిపోవుచున్నవో, నేను నట్లే యరిగిపోవుచున్నాను. పార్వతి! నేను జెప్పినమాట లన్నియు జ్ఞప్తిలో నుంచుకొని నీవు నడుచుకొనక తప్పదు. గడియగడియకుఁ జెప్పఁజాలను గాను, తెలిసినదా?

పా—(మాటలాడకుండును.)

స—పార్వతీ! అప్పుడే నిద్రయేనా? ఇట్టె నిద్రపోయినదే. మగని మీఁద గట్టిదృష్టియే యుండినయెడల నింత వేగముగ నిద్ర పట్టునా? పట్టదు—మగని మోహ యెట్టియున్నట్లు నే ననుకొనను. మంచిదే కాదా నాకు దానికిఁగూడను. రాత్రి నిద్ర లేదుగాఁబోలు. అందుచే మగనిమీఁద వాంఛయున్నను నిద్ర త్రోచికొని వచ్చినదేమో? పిల్లల కాటవస్తువుపై నభిలాష యెట్టిదో యిట్టిక్రొత్తపడుచులకు మగనిమీఁద వాంఛ యట్టిది. మఱేదైనఁ జెప్పించి మఱపించినయెడల నక్కడ కా వాంఛ యడఁగిపోవును. నిలువగా నుండి బాధించుట కారి తేఱినయనురాగమా? అధ్వాన్నమా? ఆసుజాతి కడుపునొప్పిలాగున వీరివాంఛకు తెరతెరలు. అనుభవమున్న నడివయసుదాని వాంఛ సన్నిపాతజ్వరములాగున నొక్కరీతిగ నిల్చియుండును.

పడుచుపిల్లలవాంఛ పట్టువిడుపుజ్వరమువంటిది. పొరివచ్చినప్పుడు గందరగోళమే కాని యది వదలినతోడనే చప్పఁబడును. అగడుచే వ్యాధికి బాల్యములోనే తగినచికిత్స చేయునెడల మంచిది. ఇఁకను నామగఁడు పడకటింటిలో భార్యకొఱ కెదురు చూచుచుఁ బండుకొనలేక కూరుచుండును. కూరుచుండలేక నిలువఁబడును. నిలువఁబడలేక యటులిటు తిరుగులాడును. ఆఁకలితో నున్న సివంగి బోనులో నల్లరిచేయునట్లు తపించుచున్నాఁడు కాఁబోలు. భార్య రాదన్నమాట యతని కెట్లు తెలియును? కాళ్లుచేతులు కొట్టుకొని, గింజుకొని, యేడ్చియేడ్చి పిల్లవాఁడు తుదకుఁ దనయేడుపే జోలపాటగా నెట్లు నిద్రపోవునో యట్లే యాతఁడు నిద్రపోవునేమో? రాక భార్యకొఱకు-అనఁగఁబడు మభార్యకొఱ కిక్కడకు వచ్చునో? వచ్చుటకు సాహసింపలేఁ డని నానమ్మకము. నేను నిద్రను నటించి యుండును. ఎందులకైన మంచిది.

(పద్మనాభశాస్త్రి నిమ్మళముగాఁ జప్పుడు కాకుండఁ బ్రవేశించును.)

స—(తనలో) ఆఁ వచ్చినాఁడు! క్రొత్తపెండ్లికొడుకు-రెండవరాత్రిపెండ్లికొడుకు-నలువదేండ్ల పెండ్లికొడుకు-సగ మరిగిపోయినపెండ్లికొడుకు-ఒడలుపట్టలేక-మనసుండఁబట్టలేక- మన్మథుఁడు మెడఁబట్టి గెంట-ముక్కుకొనకు వచ్చినప్రాణము లదికట్టుకొని నిలుపుకొనఁగ-హాఁ వచ్చినాఁడు! ఎంతవాంఛ! ఎంతమోహము! ఎంతతమకము! ఎంతయొడలుతెలియనితనము! నేను దినముల కొలఁది నిక్కడ వేఱుగఁ బండుకొనఁగ నాకొఱ కెప్పుడైన నిట్టర్ధరాత్రమున వచ్చినాఁడా? దీనిచక్కఁదనమునకు, దీని ప్రాయమునకు నెంత లొంగిపోయినాఁడో! నాకంటె నది

తెక్కువయయ్యో నన్నమాట స్పష్టము కాదా ? నిజముగా నాకున్న చక్కదనము దానికి లేనే లేదు. ఎటువచ్చినను బ్రాయమా ? అది చూచియే యీతఁడింత పిచ్చిలోఁ బడెనా ? ఒడలిమెఱుఁగు, నవయవములయుబుకుఁ జూచియేనా యీ వ్యామోహము ? కొఱవిదయ్యపువెల్తురి కంతనిలుకడయో ప్రాయమున కంతనిలుకడయే. రాలిపోవుచుక్క కాంతి కెంత స్థిరత్వమో ప్రాయమున కంతే కాదా ? దానికొఱకై పండ్లిగిలించుటకంటెఁ జామరత్వ ముందునా ? మేలుకొనియుంటిమో లేదో యని యింతసే పక్కడ నిలువఁబడి నిదానించినాఁడు. ఇప్పుడు మమ్ము సమీపించుచున్నాఁడు.

పద్మ—(తనలో) అబ్బ ! అబ్బ ! ప్రాణము విసిగిపోయినది. మనసు కటకటలాడిపోయినది. ఎంత సేపు కనుప్పుకొనియుండఁగలను? తుదకు గదిలో నొక్కడ నున్నయెకల మతిపోవుట నిశ్చయము.

గీ. అన్న మాసించి యెంతసే పైనఁగాని
వంటపూఁటింట నీడ్గిలఁ బడఁగవచ్చు
ధనము నాసించి ధనికుని ద్వారమందు
నెంతకాలమైనను నిరీక్షింపవచ్చుఁ
గాని, సక్రొత్తవధువుకై కటకటంచు
నిల్వఁగుఱ్ఱలతో గదిలోన నిలువఁబడుచు
నటువదేడులబట్టైన నర్థఘటిక
యుండలేఁ డుండలేఁ డుహుఁ యుండలేఁడు.

పెండ్లికూఁతును దనయొద్దఁ బండఁబెట్టుకొని యిచ్చట సరోజిని నిద్రించుచున్నదా ? సరోజినీ ! నీకొక్కతెకుఁ బార్వతి యెందులకు ?

గీ. బధిరుఁ డగు భూపమణిసభా • భవనమందు
గానవిద్యావిశారదు • ఘనత యేల ?
రసవిహీనప్రభుని హజా • రంబునందు
కలికిపలుకులకులుకుల • కవియు నేల ?

ఆహా ! ఇద్దఱు నిద్రపట్టఁ బండుకొనియున్నారు. ఇద్దఱును జక్కఁగనే యున్నారు. చదువఁగఁ జదువఁగఁ గొంత మాసి, రవంత నలిగి, యించుమంత లావై, కొంత విడిపోయిన పుస్తకమువలె సరోజిని యున్నది. సరిక్రొత్త యట్టతో, బంగారు వర్ణములతో, మూపు మరక యేమియు లేకుండ బింకములై తాకొనినకుట్లపనతో నున్న పుస్తకమువలెఁ బార్వతియున్నది. చదివినపుస్తకము తిరుగఁ జదువుట యెందులకని యీమె నుండి నాదృష్టివిముఖ మగుచున్నది. పీఠికమాత్రమే చదివి విడిచిన యీపుస్తకముపై దృష్టితో మనస్సు పఱుగువాఱుచున్నది. (చూచుచున్నాఁడు)

ఘ—(తనలో) ఎంతసేపు దానివంకనే చూచుచున్నాఁడు కాని ప్రమాదమున నైన నావంకఁ జూడఁడే ! నావంక నైనఁ జూడకుండఁ జేయునంతటి యపకారము నే నాతని కేమొనర్చితిని? తనకు సమస్తోపచారములు చేసితినే. తన్నే దైవముగాఁ బూజించుకొంటినే. వంశము తనతో నంత మగునేమో యని యీతుఱ్ఱదానిని దనకిచ్చి పెండ్లిచేసితినే. నిన్నరాత్రి చేతులారఁ దీసికొని సవతిని దనప్రక్కలోనికిఁ దార్చితినే. నావలన దోషమేమి ? అదిగో! ఇంక దానివంకనే చూచుచున్నాఁడు. ఆచూపులో నెంత యనురాగ మున్నదో ? గాలిలోనుండి మంచు బొటబొటలాడున ట్లాచూపులోఁ బ్రేమరసము చిప్పిల్లుచు

న్నదే. మొదటిపెండ్లాము మట్టి-రెండవది బంగారము- మొద
టిపెండ్లాము విషము- రెండవది బెల్లము-మగవాని కగు నని
నా కేమాత్రము తెలిసియుండినను నే నీతని కిపెండ్లి చేసియుం
దునా ? ఈతఁడు పెండ్లి కంగీకరించిన వాఁక మొత్తుకొంటినే-
దానిమెడలో మంగళసూత్రముఁ గట్టించి, నామెడలో నూరి
త్రాడు పోసికొంటిని. కానీ ! నే నీయవమానము సహింతునా?

పద్మ—(తనలో) పార్వతికి జబ్బుగా నుండుటచేత నాభార్య దానిని
బంపలేదేమో ? సాయంకాలమునఁ గడుపునిండఁ దినినదానికి
జబ్బేమి ? దానిని బంపుటకు నాభార్య కిష్టము కాకపోవునా?
అబ్బే ! ఇష్టముకాకపోవుటకు నావలనఁగాని, పార్వతివలనఁ
గాని యేమి నేరము కలిగెను ? నిన్నరాత్రి యెంతో కిలకిల
లాడుచుఁ బార్వతినిఁ దెచ్చి నా కప్పగించెనే. వేడుకలు జరి
గింపలే దని విచారించినదే. నవ్వుచు నవ్వుచుఁ జమత్కారముగఁ
బరిహాసించినది కాని యెంతమాత్రము కోపింపలేదే. అట్లయినఁ
బార్వతి యెందుల కిటుఁ బాడుకొన్నది ? వెళ్లు వెళ్లు మని నహో
జని దానిని దొందరపెట్టిన దనియే నానమ్మకము. వెళ్లు మని
పదిసార్లు చెప్పించుకొనుటకుఁ బెండ్లికూఁతుల కిష్టము. పైవా
రిబలాత్కారము చేతనే గదిలోనికి వెళ్లినట్లుండవలయును గాని
తనయిష్టానుసారముగా వెళ్లినట్లుండఁగూడ దని పెండ్లికూఁతు
తలఁపు. ఈబహిరంగరహస్యము- అందఱెఱిఁగిన యీదొంగ
తన మాచారముగా జరుగుచున్నది. మూఁడవరాత్రి చెప్పు
వారు లేరు- చెప్పించుకొనువారు లేరు. అట్లేమో పార్వతి
బెట్టుసేసియుండవచ్చును. గృహకృత్యములబడలికచే నింతలో
సహోజని నిద్రించియు నుండవచ్చును. వెళ్లవలె నని యనుకొ

నుచుండఁగనే- నిన్నరాత్రి మేలుకొనియుండుటచేతఁ బార్వతికిఁ జప్పున నిద్రవచ్చియుండవచ్చును. ఇంతకంటె నేమియు లేదనుకొందును. లేపి తీసికొనిపోవుదును.

(జెబ్బనల్లలాడించును.)

ప—(తనలో) అదిగో దానిని లేపుచున్నాఁడు. ఆ లేపినది నన్నే ముందు లేపి దానిఁ బంపుమని యడుగఁగూడదా? నే నిక్కడ నుండగాఁ దన కీస్వాతంత్ర్య మేల? నాయొద్దఁ బండుకొని యున్నప్పుడు, నాసెలవుపైఁ బండుకొనియున్న దని తాను గ్రహింపలేఁడా? ఈమూఁడు రాత్రులు నేను బాపవలసినదే కాని తాను స్వతంత్రించి తీసికొనిపోవచ్చునా, గర్భాధానచరిత్రము దిట్టవింత యిదివఱ కుండెనా? ఇఁక ముందుండునా? గర్భాధానవధూవరులమర్యాదను మంటఁ బెట్టినాఁడే. నన్న డుగకుండఁ బార్వతిని దాను తీసికొనిపోవునెడలఁ బార్వతి నన్నెంత యలుసుగాఁ జూచునో గ్రహించుకొనలేఁడా? నన్నది గడ్డిపోరకగాఁ జూచుటకే యీపని బుద్ధిపూర్వకముగఁ జేయుచున్నాఁడేమో? మనసులోఁ బెద్దయగ్గి పడినది! అది క్రమముగా తాఁకుచున్నది.

పా—(లేవకుండ నున్నది)

పద్మ—(పార్వతి రెండుబుగ్గలు పట్టుకొని యల్లలాడించును.)

పా—ఊ. ఊ. (లేచును.)

పద్మ—(అపవారించి) పార్వతీ! ఇచ్చటఁ బండుకొంటివేల? నాతోఁ గూడ రమ్ము.

పా—(తననోరు కుడిచేతితో మూసికొని యెడమచేతితోఁ బొమ్మని యూఁపును.)

పద్మ—(అప) నీయభిప్రాయ మేమో నాకుఁ దెలియలేదు. మతే మియు భయములేదు. (లేవఁదీసి) రమ్మా. రవంతదూరముగఁ బోయి మాటలాడుకొందము. (పార్వతిని జేయిపట్టుకొని రంగముయ ముందునకు వచ్చును.)

(వెనుక తెరపడును.)

పద్మ—ఇక్కడ నేల పండుకొంటివి ?

పా—నన్ను వదలుము. నేను రాను. ఊవలు.

పద్మ—ఎందుచేత.

పా—(అటునిటు భయముచేఁ జూచుచున్నది.)

పద్మ—మీయత్త యచ్చట నిద్రించుచున్నది. ఇచ్చట మతెవ్వరు న్నారు ? సందేహింపక చెప్పుము.

(సరోజిని ప్రవేశించి)

ఈతఁ డాదేవత కెట్లు మ్రొక్కునో—ఎట్లు సాష్టాంగపడునో. కనులారఁ జూచెదను. ఈతని యుపాసనాగీతము లెట్లుండునో విందును. ఈతడకచాటున నిలువఁబడి యుందును.

పద్మ—ఎందుచేత నిక్కడఁ బండుకొంటివో చెప్పకపోయితివి ?

పా—నేను జిన్నతనమునుండియుఁ దల్లిలేని దాన నగుటచేతను, నా తండ్రి దావాపుగ వెట్టివాఁడగుటచేతను గష్టములకే యల వాటు పడియుంటిని. ఈకష్టములు నామనస్సును బరిశుద్ధపఱ చినవి. నాకు భగవద్భక్తిని గలుగఁజేసినవి. నేను సర్వదా భగవంతుని నమ్మియున్నాను.

పద్మ—ఇది యంతయుఁ జెప్పెద వెందులకు ?

పా—సిగ్గుపడి తక్కువుగ మాటలాడవలసిన యీరాత్రియే యింత సవిస్తరముగ మాటలాడవలసివచ్చినందులకు విచారించుచుం

టెని. నాకష్టములు నాతోఁబాటు మీయింటికిఁగూడ వచ్చినవి. నన్నుఁబట్టి నీవుకూడఁ గష్టము నొందక తప్పదు.

పద్మ—అయ్యయ్యో! ఇదియేమి! ఇదియేమి! నాకేమియు బోధపడకుండ నున్నది. మహానందమున మైమఱచియుండవలసిన యీ రాత్రి యిదేమికర్మము? స్పష్టముగఁ జెప్పవా?

స—(తనలో) నీకు మహానందము మైమఱపునా? అది చిన్నపిల్ల కావున దానికి మహానందము గలుగవచ్చును. అది తెలియఁగ నిక్కుఱ్ఱది కావున దానికి మైమఱపు కలుగవచ్చును. నీకును మహానందమే? నీకును మైమఱపే? ఉచితజ్ఞత యున్నమాట యేనా యిది? సిగ్గున్న వాఁ డిట్లనవచ్చునా? నీకీవయస్సులో మహానందము మైమఱపు నెప్పుడు రాఁదగినదో చెప్పనా? ధర్మపత్ని యైన నాచెఁగు నీచెంగుతో ముడిపెట్టుకొని మన మిద్దఱము గంగాస్నానమొనర్చి విశ్వేశ్వరాలయమునకుఁ బోయి "హర ఓం హర హర మహాదేవశంభో" యని యుచ్చైస్స్వరమునఁ బలుకుచు మహాదేవాభిషేకము గంగోదకముతోఁ గన్నీళ్లతోఁ జేయునెడల నప్పుడు మనకు మహానందము మైమఱపు. మన మిద్దఱము గయకుఁ బోయి విష్ణుపాదమునఁ బితృదేవతలకుఁ దర్పణము లొనర్చి, పిండప్రదానము చేయునాఁడు మనకు మహానందము మైమఱపు. నీతరువాత నీకీపవిత్రకృత్యమును జేసి నిన్నుఁ దరింపఁజేయఁగలకొడుకు లేఁడని యేడ్చి యేడ్చి యీకుఱ్ఱదానిని నీకంటఁ గట్టఁగ దానియొడుపు చూచి యుబుకుచూచి, పొంకము చూచి, బింకము చూచి రెండవ రాత్రి పరీక్ష లేకపోయె నని దానికంటె నెక్కువగా నీ వేడ్చుచున్నావు. పండితుఁడవు. లాంపట్యము కూడ దని యెఱిఁగిన

హాఁడవు. ఏదో! తామరపాకున నీటిపొలె నంటీ యంటనట్లు క్రొత్తసంసారమును దీర్చుకొని కొడుకును గని సంసారత్యాగ మొనర్చి సన్న్యసింపవయ్యా యని నేను గోరఁ దిరుగుడులో మఱింత తిరుగు డారంభించితివా? దొలుపులో మఱింత దొలు పారంభించితివా?

పా—చెప్పఁదలఁచుకొనియే యున్నాను. ఎట్లు చెప్పవలయునో తెలియక త్రొక్కులాడుచున్నాను.

స—(తనలో) సరే. ఇంతయుపోద్ఘాత మెందులకు? కానీ—

పా—నీపాదసేవ చేయుటకు నేను నింటికి వచ్చితిని. నాయదృష్టహీనతచేత నాకట్టి సంతతసేవాభాగ్యము లేదు.

పద్మ—అయ్యో! అయ్యో! ఎందుచేత? నీకందుల కభ్యంతర మేమి కలిగినది?

పా—ఎప్పుడో—అవకాశము కలిగినప్పుడు—ఏ రాత్రియో—రెండుజాములవేళ నేను నీపరిచర్యకై వచ్చెదను.

పద్మ—అదేమి? అదేమి?

స—(తనలో) ఉండవయ్యా—లంఘన మనుసరికే రాగా లెందులకు? ఇరువదియుపవాసములైన పిమ్మట రోగము మరలకపోయినప్పుడు చూడవచ్చును.

పా—నేను బగ లెన్నఁడు నిక్కంటఁబడను. ఇంటియసముపాయముచేఁ గనఁబడవలసివచ్చినను నేను నీతో మాటలాడను. నీవు నాతో మాటలాడుటకుఁ బ్రయత్నింపవలదు. నావంకఁ జూచి నీ వెన్నఁడు నవ్వవలదు. నేను నవ్వను. నావంకఁ జూచి కనుసన్న యెన్నఁడును జేయవలదు.

పద్మ—అదేమి పార్వతీ! ఇంకను నిదురమత్తు వదలలేదా (భుజము

పైఁ(జిలుచుచు) అట్లు పల్కుచుంటి వేల ? ఎంత విరుద్ధముగా నున్నది! నేను భోజనము చేయను. నీవు భోజనముఁ జేయ వలదు-నేను మంచినీరు త్రాగను. నీవును ద్రాగవలదు-నే నూపిరి విడువను-నీవును విడువ వల దని యన లేకపోయినావా? అంతకంటె సందర్భముగ నుండు నే-

స—(తనలో) ఆలాగేమి ? అంతవఱకు వచ్చినదా ? నీ కది ముక్కుటూపిరికంటె నధిక యయ్యెనా ? నేను గ్రొత్తగాఁ గాఁపురమునకు వచ్చినపిమ్మట నాలుగేండ్లవఱకుఁ బగలు నీతోఁ మాటలాడితినా ? నీకంటఁ బడితినా ? అప్పు డూపిరి బిగఁబట్టి యుక్కిరిబిక్కిరి కాకుండ నెట్లుండఁగలిగితివయ్యా. అది కంటఁ బడకపోయినప్పుడే నాయీశ్వాసబంధనము. ఈయుద్బంధమరణము. అది నీకుఁ జేసిన కనకాభిషేక మేమి ? నేను జేయని దేమి ? అది నీ కిచ్చిన యింద్రభోగపదవి యేమి ? నే నీయని దేమి ?

పా—నాకు నిదురమత్తు లేదు. నే నెఱిఁగియుండియే మాటలాడుచున్నాను. మఱియొకసారి చెప్పుచున్నాను విను.

పద్మ—మఱియొకసారి యీమాటలేకదా చెప్పెదవు. తెలిసినది. ఇది నీకుఁ బుట్టినబుద్ధి కాదు. నీవట్లు నడచుకొనవలసిన దని నిర్బంధించుచున్నది మీమేనత్తయే కాదా ?

స—(తనలో) అదిగో చూచితివా ! ఎట్లుండించుచున్నాఁడో? ఇంకను మగఁ డేమిటి ? నాపిండకూడు. నాపెద్దతనముఁ జూచి, నా పెంచిన పెంపుఁ దలఁచి, నాచేసినయుపకారమును స్మరించి యీలాఁడి తెఁడుకుట్టగొట్టికాయ నాపే రీసందర్భమునఁ దెచ్చుటకు సందేహించి యుండఁగ-నదిగో-ఆఱడుగులమగఁడు, పదు

నాతేండ్లనుండి నారక్తమాంసములు పీల్చి శేరమంతయు నా దైనట్లు చెప్ప మనుచున్నాఁడు. ఈపిల్ల సంసారమును మాపిన దానను నే నని చెప్పమనుచున్నాఁడు. తన్ను యజ్ఞపశువు క్రిందఁ బట్టిబాధించుచున్న దానను నే నని చెప్పమనుచున్నాఁడు. ఆహా! ఎంతదారుణముగ నున్నది! రెండవపెండ్లివారిహృదయము లోకప్పుపాటులో నింత కృతఘ్నతాదుష్టము లగుటకుఁ బ్రకృతిలో నేమున్నదో?

పద్మ—చెప్ప వేమి? నాతో మాటలాడవల దని నన్నుఁ జూడవల దని శాసించినది నీమేనత్తయే నా?

పా—నా మేనత్త నేమియు ననవలదు. ఆమెకు నేను బహిఃప్రాణమను. నాయం దామె కంతదయ యున్నప్పుడు నే నామెను సుఖపెట్టుట నావిధి. నావిధిని నేను జేయలేకుండ నున్నాను. నే నామెభర్తయొద్దఁ బండుకొని యామెసుఖమునకుఁ బ్రతిబంధము కలుగఁ జేయుచున్నానని. అందువలన నామెకుఁ గష్టము గా నున్నదా లేదా యను ప్రశ్నమే వలదు. ఆస్థానమున నిల్చితి నని నాకుఁ గష్టముగా నున్నది. నే నిచ్చటనే దైవధ్యాన మొనర్చుకొనుచుందును. నామేనత్తతోడ నీవుసుఖముగ నుండుము. ఆమెకు నాయందు దయవచ్చినప్పుడే నీవు నా యొద్దకు రావచ్చును.

పద్మ—అయినది కాదా యామెకుఁ బదునాఱేండ్లసౌఖ్యము? ఎల్ల కాల మామెయే సుఖ మనుభవింపవలయునా యేమి? పాపము నీవు పడుచుదానవు. నీవు సుఖపడనక్కఱ లేదా?

స—(తనలో) నాకుఁ బదునాఱేండ్లసుఖముతో భరతవాక్యము పాడి, నాఁడా? నాకెల్లకాలము సుఖ మక్కఱలే దఁట. తనకు

మాత్ర మెల్లకాలము సుఖము కానలయునుగాఁబోలు ?
“పాపము నీవుపడుచుదానవు, నీవు సుఖపడనక్కఱ లేదా”
యని యెంతమృదువుగాఁ బలికినాఁడు ! పాపము జాలిగుండె
కలవాఁడు. దానికి సుఖ మెక్కడలేకపోవునో యని యార్త
త్రాణబుద్ధిచేత దానియొద్దఁ బండుకొనుటకు దేవు లాడుచు
న్నాఁడు. పాపము, తనకు సుఖమేమియు నక్కఱలేదు. పర
సుఖ మాచరించుటయే మనుజజీవనమునకుఁ బరమార్థ మని
నమ్మి యట్లాచరించుచున్నాఁడు! స్వార్థపరిత్యాగి. దేశభక్తా
గ్రగణ్యుఁడు లోకోపకారి. ఱెక్కలలో శక్తి యుండఁగానే యీ
మహాపుణ్యముఁ జేయనిమొదలఁ దరువాత నెట్లని యింతయాం
దోళనపడుచున్నాఁడు.

పా—నన్ను క్షమించి వదలిపెట్టుము.

పద్మ—పార్వతీ! నేను చెప్పినమాట విను. నిన్ను నీమేనత్త యేమి
యుఁ జేయదు. చేయలేదు. నీకు భయ మక్కఱలేదు. ఏమైన
సరే నిన్ను సుఖపెట్టుట నావిధి. మాటాడకుండ రమ్ము రమ్ము.

(పార్వతిని దీసికొని నిష్క్రమించును.)

ఘ—తీసికొనిపోయినాఁడా ? కానీ! నేనేమియుఁ జేయలేనా ? ఏమి
చేయఁగలనో చేసియే చూపుదును. ఇక్కడికి నాసంసారము
పాడైనది. భ్రష్టమైనది. ధ్వంసమైనది. దగ్ధమైనది. ఆతఁడు
దానిని సుఖపెట్టును. నన్నుఁ గష్టపెట్టును. నామేనగోడలిని
నామాట వినకుండఁ జేయును. నన్నింటినుండి వెడలఁగొట్టఁ
బ్రయత్నించును. ఇద్దఱు భార్యలున్న సంసారములు లోకమున
నెన్ని లేవు? రెండవదినముననే ప్రథమభార్యను విడాకులవల్ల

కిక్కుడఁ దక్క నెక్కుడైన వచ్చెనా? ఇది ప్రపంచమున వింత కాదా? ఓదేశీయకవులారా! ఈవిచిత్రమును మీగ్రంథములు నెక్కింపుఁడు. లోకసామాన్యాంశము లెన్ని వ్రాసిన నేమి లాభము? లోకములో నిట్టి విపరీతపరిస్థితి యున్న దని తెలియఁబఱుపుఁడు. చచ్చినవానికైన మూఁడవదినమునఁ గాని సత్తిపోఁత లేదే-బ్రతికియున్న ప్రథమభార్యకు రెండవదినము ననే యెత్తిపోఁత జరుగఁగల దని ప్రపంచమునకు నాటకరూపముగ బోధింపుఁడు. ఒడలు మండిపోవుచున్నది. రవంత విశ్రాంతి నొందెదను.

(నిష్క్రమించును)

ఇది చతుర్థాంకము.

శ్రీరామా!

# సరోజిని.

పంచమాంకము.

ప్రదేశము—పద్మనాభశాస్త్రియిల్లు.
ప్రవేశము—సరోజిని.

స—నేనే తక్క నెవ్వరు లేరు రా.

గవరమ్మ—(ప్రవేశించును.)

స—గవరమ్మా! ఉదయముననే వచ్చెద నంటివే. రాలే దేమి?

గ—రావలె ననియే బయలుదేఱినాను. రెండడుగులు వేసినానో లేదో పూజారి వెంకయ్యామనుమఁడు నారెండుచేతులు పట్టుకొని యింటిలోనికి వెనుకకుఁ దీసికొనిపోయినాఁడు. ఒకగంటనే పొక్కలే సోదె చెప్పినాఁడు. ఆతనికి మందిచ్చిపంపుసరికిఁ బదిగంట లైనది. మీకు వంటవేళకదా యని యప్పుడు రాలేదు. అమ్మా! ఎప్పుడు నన్నుఁ బిలిపింపనివా రిప్పు డెందులకుఁ బిలిచినారమ్మా-

స—చెప్పెదనుగాని-పూజారి వెంకయ్యసోదె యేమి?

గ—వెంకయ్యకా దమ్మా. ఆతనిమనుమఁడు.

స—ఆతనిపేరుకూడ వెంకయ్యయే లే.

గ—అలాగా అమ్మా! నాకుఁ దలనొచ్చినది. దిక్కుమాలినపోకె చెప్పినాఁడు.

సౌ—ఏదది ?

గ—కలియుగములో నేమున్నదమ్మా-అన్నిసంసారములలో నొక్కటే గొడవ. ఒక్కటేగోల. పెద్దసంసారాలలోఁ బెద్దగోల- చిన్నసంసారాలలోఁ జిన్నగోల. ఆఁడుదానికి మగవాఁడు స్వాధీనుఁడు కాలేదని, మగవాని కాఁడుది స్వాధీనురాలు కాలేదని-మగవాఁడు పైయాఁడుదానికిఁ గన్నుగీటినాఁడని, యాఁడుది పైమగవానినిఁ జూచి పండ్లిగిలించిన దని సంసారాలలోఁ దిమ్ములాటలు గ్రుద్దులాటలు చెప్పవలసిన దేమున్నది? పోఁగాలము కాక పోయిన నేమమ్మా-పోతంతపడుచు సమర్తాడి మూఁడేండ్లయినది. మగనిపొడ, పొందు పనికిరాదుకదా.

స—పూజరివాని పెండ్లాముమాటయేనా ?

గ—కాదా-అమ్మా! నిరాదు రేవున మీరు జూచియే యుందురమ్మా. స్ఫోటకపుమచ్చలకుప్పది. పొట్టిగఁ గుదించినట్లుండును.

స—ఎఱుఁగుదును.

గ—దాని కేమైన లోపమా-అమ్మా-దానికి మగఁడనఁగ నంతమేదు పెందులకు? జోడెడుఁ బోయినారు. పెద్దలకుఁ జెరటాండ్రకుఁ జెట్టుకొన్నారు. ముగ్గులలోఁ గూర్చుండఁబెట్టి హూత్ వేస్తున్నారు. గ్రహాపూజ లేవో చేయించి ఫట్‌ఫట్ మన్నారు. ఎందులకు లొంగకపోవుటచేత నాయొద్దకు వచ్చినారు. ఏదో మందిచ్చి పంపినాను.

స—ఆపిల్లదానిబుద్ధి మరలి బాగుపడునా ?

గ—ఒక్క మోతాదుతోఁ దెలికపిండి వేసినకుక్క!—అందులోఁ ది
గులే దమ్మా—

స—మీమందులవలనఁ గొందఱకు వాంతు లగు నని, కొందఱకు
వెఱ్ఱు లెత్తు నని, కొందఱు చత్తు రని యందు రేమి ?

గ—ఆలోపము మనలో నున్నది కాని మందులో లేదమ్మా-తిన్నగఁ
జేయక పోయినయెడల నన్నిమందులు వికటించి ప్రాణములు
తీయును. నన్నిపాత భైరవిలో నాభి తిన్నగ శుద్ధిగానియెడల
రోగికిఁ జావువఱకు రాదా మఱి ?

స—ఆఁడుది మగవానికి మందుఁబెట్టుటయే కాని మగవాఁ డాఁడువా
నికి మందుపెట్టినట్లు వినలేదు. ఈవెంకయ్యసంగతి వింతగా
నున్నది.

గ—అబ్బే. ఆలాగీలాగునఁగూడ నున్నదమ్మా. ఆఁడుదానికి, మగ
వానికి పైభేదమే కానిలోపలి భేదములే దమ్మా. ఆఁడుది మగ
వానిని వశపఱచుకొనలేనప్పుడు దాని కాఁడుఁదనము తక్కువ
యన్నమాట. మగవాఁ డాఁడుదానిని వశపఱచుకొనలేనప్పుడు
వానికి మగతనము తక్కువ యన్నమాట. ఈయెగుడుదిగుడులు
సరిచేయుటకే మనమందులు.

స—మందులలో నేమియుఁ బ్రమాదము జరుగ దన్నమాట సత్య
మేనా?

గ—ఇదిగో! ఈభూదేవితోడు. అందులో గవరమ్మమం దనఁగా సం
జీవి.

స—వెంకయ్యసంగతి నాతోఁ జెప్పినట్లే నాసంగతి నీవు మఱెవ్వరి
తోడనైనఁ జెప్పుదువేమో?

గ—ఆలాగే మైనయెడల నరనిముసము వైద్యము చేయఁగలనా? నా

తో నిది మూఁడవతరము. ఈ చెవితో విన్నమాట యాచెవిని బోవలసినదే. ఎక్కడ విన్నది యక్కడనే గుటుక్. గప్ చిప్. మీ కాసందేహ మక్కఱలేదమ్మా.

స—అటులైన విను. ఈనడుమ నాభర్తకుఁ బెండ్లియైన దని నీకుఁ దెలియునా ?

గ.—మీరు చేసినపెండ్లియే కాదా? లోకమంతయు మ్రోగిపోయి నదమ్మా—"సరోజినమ్మ యెంత మంచియిల్లాలమ్మా! ఆమె వంటి యాఁడుది స్వర్గలోకమునసైన నుండదమ్మా? అంత దైవభక్తి గల యమ్మ లేదమ్మా! అంత పతిభక్తి గల యమ్మ లేదమ్మా!" యని యూరూరఁ గాక దేశదేశాలలో హోరెత్తిపోవుచున్నది—నేను వ్యాపారముమీఁద నెక్కడి కెక్కడికో పోవుచుండును గనుక నాకుఁ దెలియునమ్మా.

స—ఏమైన నేమి? నాకోర్కె తీఱునట్లు లేదు. అతఁడు దానితోఁ గాపురము చేసి కొడుకును గను నని నేను నమ్మాను. కొడుకు మాట దేవుఁ డెఱుఁగును. అంతవఱ కిప్పు డెందులకు? మీఁదఁ జేయువైవఁడే! కంటఁ జూడఁడే! అంత దూరాన నిలువఁబడఁడే. ఇది తూర్పుమొగము. అతఁడు పడమటిమొగము. ఎందుల కీపెండ్లి జేసితినా యని నేనేడ్చుచున్నాను.

గ—అమ్మా! మనలో మనమాట. అతనికి దేహశక్తి తగ్గిపోయినట్లు లేదుకదా ?

స—తెగులు!

గ—కాదమ్మా! తత్త్వమునఁ బటుత్వము తగ్గినది. అందుకొఱకే యీ పైఁటబెదరుతనము. కోకఁ జూచి గోలపెట్టినవాఁ డద్దిద్ది యనక తప్పదమ్మా ఒక్కమోతాదుతో బిగిసి, తాడుపాటి

పెండ్లామును నెత్తి నెక్కించుకొని యమ్మవారిఘటమువలె నూరేగించును.

స—పోనీ. దానికాఁపురము చక్కఁబడిన నాకుఁ జాలును.

గ—ఇఁక నీమొగము చూడఁడేమో ?

స—చూడకపోవుటయే నాకోరికకూడను. ఎల్లకాలము నాసుఖమే చూచుకొన్నయెడల దానిబ్రదు కేమి కావలసినది ? నేను నాసుఖముకొఱకుఁ జూచుకొనుదాననైనయెడల నింత నాటక సృష్టి యేల యగును ?

గ—ఆమెకొడుకును గనును—మందు పంపుమంటురా ?

స—సాయంకాలమున నీవే తెమ్ము. నే నిక్కడనే యుండి తీసికొందును.

గ—అదిపెరుగులోఁ గలిపి యాయనకు రాత్రి వడ్డింపుము.

స—సరే—నీవు పోయెదవా.

గ—సొమ్మిండు.

స—ఎంత.

గ—పదిరూకలు. గుణమిచ్చినపిమ్మట బహుమానము. ముందామెచేతనే పెట్టింపుము.

స—తరువాత చూచుకొనవచ్చునులే (సొమ్మిచ్చును.)

(గవరమ్మ పోవును.)

స—నాబ్రదుకు ముందుపెట్టి మగనిని వశపఱచుకొనువఱకువచ్చినదా? ఆఁడుదాని కాయువుప ట్టెక్కడనున్నది ? శరీరసౌందర్యములో లేదు. వాక్చమత్కృతిలో లేదు. నగలలో లేదు. నాణెములలో లేదు. మేడలలో లేదు. మిద్దెలలో లేదు. కీర్తిలో లేదు. సంతానములో లేదు. స్వాధీనభర్తృకతలో నున్నది.

ఆమైశ్వర్యము తీఱిపోయినది. ఆయుస్సింకఁ దీరినది కాదు. ఇంతట భర్తను వశపఱచుకొననైన వలయును ప్రాణము పోఁగొట్టుకొననైనవలయును. ప్రాణము పోఁగొట్టుకొనఁగలను గాని యవమానము పోఁగొట్టుకొనఁగలనా? ఈమం దెట్లు వికటించునో? ఏమగునో తెలియదు. కాలుచున్నపూరికొంప వలెఁ గుమిలికుమిలి పోవుచున్నాను.

(నేపథ్యమున) సరోజినీ! ఏమిచేయుచున్నావు?

స—దానితోడనే యెల్లకాలముండెదను. నీవు నాకక్కఱలేదని చెప్ప టకుఁగాఁబోలు వచ్చుచున్నాఁడు. నే నెక్కడ నుంటినో యని వెదకుకొనుచున్నాఁడు—రానీ—

(పద్మనాథశాస్త్రి ప్రవేశించును.)

పద్మ—ఇక్కడ నుంటివా? ఎన్నిసారులు పిలిచినను బలుకలే దేమి? కోపమా?

స—నాకుఁ గోపమైన నిప్పుడు నీకేమి? నాకోపమును నీవు గణించి నకాలము దాఁటిపోయినది కాదా? నాకుఁ గోపము రాకుండ నీవు ప్రవర్తించినకాలము దాఁటిపోయినదికాదా? నాకోప మునకు నీవు గడగడలాడినదినములు వెడలిపోయినవి కావా? ఇప్పుడు నాకోపము నీ కేమి లెక్క? నాకోపము నన్ను దహించిన దహింపనీ! నీవు కంటఁదడిఁబెట్టవలసిన యావశ్య కత యేమున్నది? అంతవఱ కెందులకు? నీవు రవంత స హింపవలసిన పనిగూడ నేమున్నది—ఏమియు లేదు—దయచే యుము.

పద్మ—నీకోపమున కిప్పుడుకూడ సందేహించువాఁడనే—ఇప్పుడుకూడ భయపడువాఁడనే—ఇప్పుడుకూడ నీకుఁ గోపమురాకుండఁ బ్రవ

ర్తించువాఁడనే—నే నన్యథా పరివర్తించితినా? పరివర్తించిన యెడల నెప్పుడు పరివర్తించితినో చెప్పుము.

స—నేను జెప్పుట యెందులకు? నీవెఱుఁగవా? ఇంతలో మఱపా? నాహృదయములోనిబాకు నీకు పరాకా?

పద్మ—నిన్నరాత్రి నీయొద్ద బండుకొనిన పార్వతిని ద్వితీయవిఘ్న దోష మెందులకని గదిలోనికిఁ దెచ్చితిని. ఇదేనా నాదోషము? ఇది నీకుఁ గోపకారణ మగు నని నే ననుకొనలేదు.

స—ద్వితీయవిఘ్నదోష మగునని తెచ్చితివా? ఎంతశాస్త్రసమ్మతప్రవర్తకుఁడవు? ఎంతయథావిధికర్మకరుఁడవు! సూర్యోపాసన యను దినముఁ జేయుచున్నావా? అది నీకక్కఱలేదా? శతపథోపనిషత్తుఁ బఠించితివా? అది నీకుఁ బనిలేదుకాబోలు. గయాశ్రాద్ధముఁ జేసితివా? అది నీకుఁ జెప్పఁబడినవిధి కాదు కాఁబోలు. యాజ్ఞవల్క్యవిగ్రహామునకుఁ బూజచేయుచున్నావా? అది బుద్ధిహీనులపని యని యూరకుంటివికాఁబోలు. రెండెనిమిదులసంవత్సరాలనుండి సంసారము చేయుచున్న నీకు ద్వితీయవిఘ్నదోష మంటుకొను నని, కర్మవిచ్ఛిత్తి కలిగి పోవు నని, యింక బ్రాహ్మణ్యము భగ్నమగు నని, యిఁక నుత్తరగతి యూడిపోవు నని దొంగకోళ్లను బట్టుకొనువాని వలె వచ్చి దానిని దీసికొనిపోయితివా?

పద్మ—సరోజినీ! అంతయధిక్షేపణ మెందులకు? నేను జేసిన యపరాధ మేమియు లేదే—నాభార్యను నేను రమ్మని తీసికొని పోయితిని.

ప—మూఁడురాత్రులు కాకుండ నప్పుడే నీభార్య యైపోయినదా?

దానిపై నీ కప్పుడే యంతస్వాతంత్ర్యము కలిగినదా ? ఈమూఁడు రాత్రులు నేను దీసికొనివచ్చి నీగదిలో విడుచునాచారము కుక్కముట్టుకొనిపోయెనా ?

పద్మ—అటులైనఁ దీసికొనిరాలేకపోయినావా ?

స—పతీ—వర్జ్యము వచ్చినది. అదిపోయినతరువాతఁ దీసికొనిరావలయు ననియే యనుకొంటిని.

పద్మ—అలాగా—వర్జ్యము వచ్చినదా ?

స—మఱియే మనుకొంటివి ? మగనియొద్దఁ బండుకొనుటకు నాకిష్టము లేక పంపలే దనుకొంటివా ? నీభార్య నాకెందుకు ? తలఁపి దూడయంతదానిని శాశ్వతముగా నాగొంతుకమీఁదఁ బెట్టు కొందు ననుకొంటివా ? నాలుగుగడియ లాలస్య మైనందుల కెంత నాటకము పెంచితివయ్యా.

పద్మ—పెంపను లేదు—త్రెంపను లేదు—అక్కడ నున్నదికదా యని రమ్మంటిని.

స—దానిని నీవురమ్మనుట యెందులకు ? నే నక్కడ మొద్దులాగున నుంటినిగదా, నన్ను లేపి దానిని బంపు మని నాతోఁ జెప్పఁ గూడదా ? నాయొద్ద నున్నదానిని—నే నక్కడఁ బండు కొను మని శాసించుటచేతఁ బండుకొన్నదానిని—నాతోఁ జెప్పకుండ, నీవు స్వతంత్రించి తీసికొనిపోవు నెడల నీకు నాయెడల గౌరవము లేదు సరేకదా?—దానికిఁగూడ లేకుండఁ జేసి తివి. అది నన్నుఁ దృణప్రాయముగఁ జూడదా ? నీకు నామీఁద లక్ష్య మేమాత్రమును లే దని యది గ్రహించుకొనకపోవునా ? నాకు దానికిఁ జెడగొట్టుటకై నీ విపని చేసితివా?

నాతోఁ జెప్పఁగొట్టి నీవు నదియు నేకమై నన్ను శంకరగిరిమన్నె
ములకు సాగనంపఁదలఁచితిరా?

పద్మ—లేనిపోనితప్పు లెన్నకు—నీకు నిద్రాభంగముఁ జేయుట యెం
దుల కని యట్లు చేసితిని.

స—అది దొంగమాట. భగవంతుని మొగముఁ జూచి మాటలాడవ
లయును. నేను దాని నేదో నిర్బంధపఱచినా ననియు-నీనిర్బం
ధమెంత, నీవెంత యని నన్ను గడ్డిపోరకక్రిందఁ జూచి నీ వట్లు
చేసితివి. నేను నీకంటికి గడ్డిపోరకగా నున్నను నాకు విచా
రము లేదు. దానికంటికిఁగూడ నే నట్లుండునట్లు చేసితివి.
నీయాచర్యమూలమున నింక నాకు దానికిఁ బడునా? వట్టి
కల్ల. ఇఁక నేను దానివలన నవమాన మొందుచుఁ దిట్లు
దినుచు నిక్కడనుందునా?

పద్మ—సరిసరి. బాగుగనే యున్నది. చాలు లే.

స—బాగుగనే యున్నదని నన్ను నిందించుచున్నావా? నీవు నాయొద్ద
నుండి తీసికొనిపోయినవాఁడవు గదిలోనికిఁ దీసికొనిపోవక
యాపంచపాళికొనకేల తీసికొనిపోయితివి.

పద్మ—(తనలో) అయ్యో కర్మము-పార్వతి చెప్పినదికాఁబోలు. కేవ
లము తెలిసినతనము కాదు, తెలియనితనము కాదు-మధ్యావస్థ
చేతఁ జిక్కుఁ దెచ్చిపెట్టినదే. (ప్రకా) ఏదో రవంతబుజ్జగింప
వలయునని.

స—మొదటిరాత్రి లేని బుజ్జగింపులు రెండవరాత్రికావలసివచ్చిన వేమి?
బుజ్జగింపెందులకు?

పద్మ—అది రా నని నిరాకరించినది లే.

స—మీామేనత్త నీకు వెళ్ళవద్దని బోధించినదా యని నీవడుగలేదా?

పద్మ—(తనలో) అయ్యో! ఇదికూడఁ జెప్పినది. (ప్రకా) వివరము లెందులకు? క్షమింపుము.

స—తలమీఁదఁ దన్ని దాసోహమా? నీయత్త నిన్నేమియుఁ జేయదు. చేయలేదు. అని నీవు దానికిఁ గంఠోక్తిగాఁ జెప్పలేదా?

పద్మ—అది లోనికి వచ్చుటకై యేదో రవంత నమ్మకముకొఱకు—మఱి యేమిచేయుమంటివి——తాత్కాలికోపయోగముకై యట్లనవలసివచ్చినది.

స—నీప్రతిష్ఠ పోయినసరే- నామర్యాద పోయినసరే? నీ కది ప్రక్కలోనికి వచ్చినయెడలఁ జాలునా? అదియేనా నీజీవితమునకుఁ బరమావధి. ఇంతవెఱ్ఱిపడుచుంటి వేల? నేను రాత్రులకొలఁది నిచ్చట వేఱుగాఁ బండుకొన్నప్పుడు నీవు నాకొఱకు దేవులాడుచువచ్చితివా? ఏవో మాయమాటలాడి నన్నుఁ దీసికొనిపోయితివా? నానాఁడు లేనివెఱ్ఱి యీనాఁ డేల కలుగవలయును. ఉత్తరవయస్సులో నీ కీవెఱ్ఱి తగునా, తగదా యను నంశ మావలఁ బెట్టుము. నేను నీకు వెఱ్ఱి యెత్తింపలేకపోవుట యేమి- అది యెత్తింపఁగల్గుట యేమి? దానికై నీవు పెంపుడుపిల్లివలె 'మేవ' ని కూడ కూడఁ దిరుగుట యేమి? నేను దినములకొలఁది కనఁబడకున్నను నీకుఁ జీమకుట్టినట్లు లేకుండుట యేమి? నీకు వెఱ్ఱి యెత్తింపఁగలిగినది దానిలో నున్న దేది? నాలో లేని దేది?

పద్మ—నాకు వెఱ్ఱియెత్త లేదు. పిశాచము పట్టలేదు-లేనిపోనిసందేహములు పెట్టుకొనకుము.

స—నూఱు చెప్పు, లక్ష చెప్పు, నేను నమ్మను. అది నీకు మందు పెట్టినది. నాకర్మము-నాకర్మము.

పద్మ—అదిమందు పెట్టదు-నీవు విషము పెట్టవు. ఏడ్చుటకు మఱియొక కారణము కనఁబడక యేడ్చుట కాని యంతకంటె నేమున్నది? నేను నీతో మొదటఁ జెప్పలేదా? నాకుఁ బెండ్లి వలదు. అందువలన నెన్నియో బాధలున్నవి-నన్ను నిర్బంధపెట్టవల దని చెప్పలేదా? నీవు నామాట విని యూరకుండునెడల నాకీయము బాధ లేకుండునుగదా?

స—కేవలస్వార్థపరిత్యాగినినై నీకుఁ బెండ్లి చేసినందులకు లోకము వేనోళ్ల నన్నుఁ గొనియాడుచున్నది. నీవు నాచేఁతలో నున్న ఘనతను తెలిసికొనలేకుండ నున్నావు. మీఁదుమిక్కిలి తిట్టుచున్నావు. లోకములో పాటేకదా యని పెండ్లిచేసితిని. అంద అవంటివాఁడవే కదా యని యనుకొంటిని. గర్భాధానపు రెండవరాత్రియే రెండవభార్యతోఁ గుట్రచేసి ప్రథమకళత్రము నైన నన్ను-ధర్మపత్ని నైన నన్ను-వంశము నిలువఁబెట్టుటకై పెండ్లిచేసిన నన్ను-వేరుచేసి నామేనకోడలినైనను నామాట వినకుండఁ జేసి, నాయెదుటనే దాని బుజముపై కెత్తుకొని యిల్లంత పరవడలు ద్రొక్కి, నన్నింటినుండి వెడలఁగొట్టుటకుఁ బ్రయత్నించితివే. ఇంతమహానుభావుఁడవు. ఇంతకృతఘ్నుఁడవు. ఇంతద్వితీయభార్యాలంపటుఁడవు—ఇంతప్రథమభార్యాపరిత్యాగి వని—నేను గ్రహింపఁగల్గితినా-ఏడ్చితినా? రెండవదినమున నే ఘటశ్రాద్ధమా? కాకేమి? నీపని యేదో నీకైనది. నే నింక గంగలో దిగపనేమి-కాటి కేగిన నేమి?

పద్మ—ఎందుల కాయసందర్భప్రలాపములు. జరిగిన దేదో జరిగిపోయినది. ఇఁక ముం దిట్లు జరుగవలయు నని చెప్పు- ఆరీతిగా జరుపుకొందము.

స—వెనుక నెట్లు జరిగెనో యట్లు జరుగునెడల నిఁక ముందు జరుగును.

పద్మ—వెనుక జరిగిన ట్లనఁగా?

సత్యవ—'యనఁగా' కర్థము నేను జెప్పవలయునా? వెనుకటికాఁపురపుఁ గ్రమమంతయు గడ్డలైనదా? అయ్యయ్యో! మాఱుమనువుతో నీకు జన్మాంతరము వచ్చిన ట్లయినదే-మఱపున కొక్కమాపటి కాఁపురమా? తేపటి కాఁపురమా? నేను నీయింటికి వచ్చుట తోడనే కొడుకును గనియుండునెడల నాకొడుకున కిప్పటి కింకొక్కకొడుకు కలిగియుండునే. మనుమఁడు కనవలసినకాల ములో మాఱుపెండ్లి చేసికొని మొదటిమనువుమర్యాద మఱచి పోయితివా? మంటఁ బెట్టితివా?

పద్మ—అబ్బబ్బ! భక్తీ చదువు చదువక—వెనుక నొకతెతో జరిగి నది. ఇప్పు డిద్దఱితో జరుగును. సరిగా వెనుక జరిగినట్లే జరు గవలయు నన్న నెట్లు?

స—అది తనికిరాదు. అట్లు జరుగకపోవునెడల దానిని వదలుకో.

పద్మ—ఆఁ. దానిని వదలుకొనుట యెందులకు?

స—పెండ్లియొక్కఅలే దని యన్నవాఁడవేకదా? గర్భాధానమున కేవే డుకలు పనికిరా వని శాసించినవాఁడవేకదా? గర్భాధానపు రాత్రి నీవు నాతో నన్నమాట లప్పుడే మఱచితివా?

పద్మ—ఏ మంటిని?

స—స్ఫోటకదేవత వచ్చి వెనుకటి రోగాల నన్నిటిని సాగనంపి నట్లు క్రొత్తపెండ్లాము వచ్చి పాఁతసంస్కారముల నన్నిటిని తొలఁ దోలినదా? చెప్పెదను విను—'ప్రాఁతజోడుపరిపాటిచే సుఖమి చ్చును, క్రొత్తజోడు పడఁగఱచున' ని నీ వనలేదా? నీక్రొత్త జోడు నిన్నేకాక నన్నుఁగూడఁ గఱచినదే?

పద్మ—నే నట్లంటిని. అప్పటికి వివాహ మింకఁ గాలేదు కాదా?

స—అదేమి? గర్భాధానమునాఁటికి వివాహము కాకపోవుట యేమి?

పద్మ—ఈమాత్రపుఁదప్పున కేమిలే. అప్పటికి మే మిద్దఱముఁ గలియ లేదుకాదా?

స—అందుకొఱకే యింతపుట్టిమునుక. ముప్పదవయేట రెండవభార్య వచ్చినవా రున్నారు. ఏఁబదవయేట రెండవభార్య వచ్చినవా రున్నారు. వారందఱు నీయట్లే చేసిరా? "నీవు నాప్రథమ భార్యమాట వినవక్కఱలేదు-అది నిన్నేమియుఁ జేయదు. చేయలేదు-నేను నీకున్నాన" ని రెండవభార్యతోఁ జెప్పి దానిని లోఁబఱచుకొని, మొదటిభార్యను రెండవరాత్రి సాగ నంప సిద్ధపడినవాని నొక్కనిఁ గనఁబఱుపఁగలవా? నీవు నా దైవభక్తిని గణించితివా? నాభర్తృభక్తినిఁ జూచితివా? నేను నీవంశవృద్ధికై యెంతమహోదారమైన కార్యమును జేసితినో నీవెఱుఁగవు కాని లోక మెఱుఁగదా? నాయెడల నీ విట్లు ప్రవ ర్తింపవలసినదా? నామనస్సు విఱిగిపోయినది. ఏమి చెప్పిన నైన నేను వినను.

పద్మ—అగ్నిసాక్షిగఁ బెండ్లాడిన ధర్మపత్నిని విడువు మని బోధించుట మహాపాపముకాదా?

స—అది నీకు ధర్మపత్ని కాదు-నేను. ధర్మపత్ని యుండఁగా నొకటి, రెండు, మూఁడని యవసరానుసారముగాఁ జేర్చినవా రందఱు ధర్మపత్ను లగుదురా? ముహూర్తమైనఁ జూడకుండ, వాకిటికి ముగ్గైన లేకుండ-గుమ్మానికిఁ దోరణమైన గట్టకుండ-నేశివాల యములోనో, యేయమ్మవారిగుడిలోనో యెడమొగము పెడ

సుగముతోఁ జేసినపెండ్లిలోని విధిలేని పెండ్లికూఁతురు ధర్మ
పత్ని యగునా? ఇట్టిధర్మపత్నిముండలు మగముండకొడుకు
లకుఁ దలకు ముగ్గురేసి నల్వురేసి యున్నారు.

పద్మ—ఛీ! పలుగుమాటలాడకు-నేను దానిని విడువను. నిన్ను విడు
వను. అది నీయెడల నవిధేయురా లెంతమాత్రము కాదు.
నీ కది సేవఁజేయుచుండును. నీవు నదియుఁ బొందికగా నరిపు
చ్చుకొని నన్ను సుఖపెట్టుఁడు. మీయిద్దఱును సమర్థించుకొను
చుండుదును.

స—ఇదిగో సమర్థించితివి కాదా-సముదాయించితివి కాదా-పూఁటన్న
రతో నయ్యవారికి మతిపోయినది. పెద్దమ్మగారికి సన్న్యాసము
వచ్చినది.

పద్మ—నీవు మునుపటి సరోజినివలెఁ గనఁబడవు. నీబుద్ధి మాఱిపోయి
నది.

స—ఎందుచేతనో తెలియునా? నీబుద్ధి మాఱుటచేత.

పద్మ—సరోజినీ! నీవు పొరపాటు పడుచున్నావు. నీమీఁదకంటె దాని
మీఁద నెక్కువ దయలేదు.

స—నేను నమ్మను. మాటవరుసకు లే దనుకొన్నను నామీఁద ను
న్నంత దయయైన దానిమీఁద నుండఁదగదు. అది మహాద్రో
హము. అది యిక్కడ నుండఁగూడదు.

పద్మ—సరోజినీ! నీవు పట్టుపట్టకు- నీవు నిలువఁబెట్టినసంసారమును
నీవు పాడుచేయవలదు- కొడుకు కలుగుటకై నీవు సంకల్పించి
యీకార్య మొనర్చితివి. నీయాశీర్వాద మీవంశమునకు సిద్ధిం
చునట్లు చేయుము. అసూయకును నాగ్రహమునకుఁ గారణము
లేదు. ఉన్నకారణమేదో యది మహాల్పము. అదిమనస్సునుండి

తుడిచివేసికొనవలయును. నన్నుఁ దొందరలో నీవన్నమాటలు నేను క్షమింతును. నిన్ను నే నన్నవాక్యములు కఠినములైనయెడల నన్ను మన్నింపుము. అల్లరిపడవలదు-నామాట వినుము-లోకము చెడ్డది. మంచియింటి కన్నివంకలైన నన్నును. ఇంతవఱకుఁ బ్రజనోటఁ బడినవారము కాము- నామాట వినుము-పోవుదును. (నిష్క్రమించును.)

స—మం తీరాత్రి పెట్టకతప్పదు- దానితోఁ జిక్కఁబడినయెడలఁ జూచుకోవచ్చును. లేనియెడల నెంతిపనియైనఁ జేసెదను. మందు నామేనగోడలే భర్తకుఁ బెట్టినట్లు లోకమున వెల్లడియగుట మంచిది.

(నేపథ్యమున) అత్తా! మల్లెపూలు వచ్చినవి. కొననా ?

ప—కొనకేమమ్మా. (తనలో) దీని కెంతసేపు తలదువ్వుకోవలయునని, పూలు పెట్టుకోవలయునని, సింగారించుకోవలయు నని, మగనిని వశపఱచుకొందమని దేవులాట. నాదేవులాటకూడ మగనిని వశపఱచుకొనవలయు ననియే—కాని నామార్గము వేఱు—సవతిని సాగనంపవలయు నని, మగనికి మందుఁ బెట్టవలయు నని నేను దేవులాడుచున్నాను- గమ్యస్థాన మొక్కటియైనను మార్గములుమాత్రము భిన్నములగుట ప్రపంచపద్ధతియందుఁ బరమార్థపద్ధతియందు సమానమేకదా ?—కాని మఱియొక సందేహ మున్నది. నేను నాభర్తపైఁ బార్వతిపైఁ బగఁదీర్చుకొనుటకు సంకల్పించుకొనియున్నాను. దీనిని వెడలఁగొట్టుట కెంతపట్టుదలతోఁ బ్రయత్నించినను నామాట సాగినదికాదు. ఇఁక బహిరంగప్రయత్నములవలన వీరు లొంగరు. కావున వారిని నమ్మినట్లేయుండి వారివిశ్వాసము నభివృద్ధిపఱచుకొని

యవసరము రాఁగనే వారిపైఁ బగఁదీర్చుకొందును- కాని యిట్లు మనస్సు మాటు చేసికొని, నాలుక చివర మాట లాడుట నా ప్రకృతి కాదు. పాము మెలిక నడకలు నే నిదివఱకు ఎఱుఁగను. ఇదిగో- ఈవశీకరణపుమందు సంపాదించు ప్రయత్నమందే క్రొత్తమార్గముఁ ద్రొక్కినాను. మాయామార్గమం దెల్లు నిరంకుశముగ నడవఁగలనో తెలియదు. అవసరమే—ఆవశ్యకతయే యన్నియు నేర్పును. ప్రతిజీవముకూడఁ బరిస్థితులకు బానిసయే- అట్లే నేనును— ఇంటిపని చూచుకొనుటకు స్వస్థత లేదు- రవంతసేపు పండుకొందును- అసురసంధ్యాసమయ నిద్ర దరిద్రతాహేతు వందురు ఇప్పుడు భాగ్య మేమి యేడ్చినది—

(నిష్క్రమించును.)

ఇది పంచమాంకము.

శ్రీరామా!

# సరోజిని.

## షష్ఠాంకము

ప్రదేశము—వీథి.

(ప్రవేశము—వాతాపిశాస్త్రి-నారాయణశాస్త్రి.)

వా—నారాయణశాస్త్రీ! పద్మనాభశాస్త్రి యదృష్టవంతుఁడుసుమా!

నా—వాతాపీ! చావుతప్పి బ్రదికినందులకేనా?

వా—పార్వతి మందుఁ బెట్టినప్పటిమాటకాదురా.

నా—మఱేమి?

వా—సరోజినమ్మ సంకల్పసిద్ధురాలురా-పద్మనాభశాస్త్రికిఁ గొడుకు పుట్టవలయు నని సంకల్పించి వివాహము చేసినది-ఇప్పుడు పార్వతికిఁ గడుపు. అయిదవమాసము.

వా—నీ కెట్లు తెలిసినది?

వా—వారికి మాకుఁ జాకిత యొక్కతే. అది నాభార్యతోఁ జెప్పినది.

వా—కడుపువచ్చినప్పుడెల్లఁ గొడుకు పుట్టునని ప్రకృతిసూత్ర మున్నదా యేమి? అప్పుడే సరోజిని సంకల్పసిద్ధురా లంటివి.

వా—ఇప్పటివఱకు సత్య మగునది ముందుఁగూడ సత్యమే యగును.

వా—సరే. ఈసంగతి నతోఁ జెప్పితి వెందులకు?

పా—ఈదినమునఁ బుంసవనము. ఆశీర్వచనమున నేనైన దొరకఁగలదు

నా—అటులైన మంచిమాట చెప్పితివి. నడు పోదము.

(నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.

---

ప్రదేశము—పద్మనాభశాస్త్రియిల్లు.

ప్రవేశము—పార్వతి, పద్మనాభశాస్త్రి, సరోజిని.

పద్మ—భగవత్కటాక్షమునఁ బుంసవనము యథావిధిగ నైనది. భూసురుల మంగళాశీర్వాదము లైనవి. ఇది యంతయు నీపుణ్యము—నీమహిమ—నీచలువ. నీనోటివాక్య మింతవఱకు ఫలించినది. శేషించినదికూడ నచిరకాలములో నీయభీష్టానుసారమే జరుగును.

స—తథాస్తు! (తనలో) నాయభీష్టానుసారమే జరుగునెడల నైదునెలలగర్భ మైనవేలతునుకలై భూమిని బడిపోవలసినది కాదా? నాస్థానమున నిల్చి, నాప్రక్కను బండి నామగని తనమగని జేసికొని నన్నెడిపించిన యీముచ్చిబొ[illegible], కాళ్లుపడి, కన్నులూడి, పొట్టబ్రద్దలై, కొనయూపిరి యుండఁగనే కాకులు పొడువ, గ్రద్దలు పీకుకొ[illegible]నఁ, నక్కలీడ్చుకొని పోవలసినదికాదా? రవంత మాసినసౌందర్యమును రోసి క్రొత్త

రంగులకై యాసించి లోనిసారమును గుర్తింపక, పైయుబుకుల కులికి గోరక్షణమును మాని కుక్కను మెడకుఁ గట్టుకొని పురోడాశమును నోటఁ బెట్టక యుల్లిపాయను నమలి, పతితుఁడై, భ్రష్టుఁడైన యీపడుచుపెండ్లాము మగఁడు ముద్దుపెట్టుకొనుటకు మూతి కదలక, కౌఁగిలించుకొనుటకు చేతులు కదలక నపుంసకుఁడై, నపుంసకుఁడై, నపుంసకుఁడై నాల్గువందలయేండ్లుండవలసినదే-

పద్మ—పార్వతీ! నీ కక్కయైనను, దల్లియైనను నత్తయైనను, నీపాలిటి శుభదేవత యైనను నీమెయే. ఈమెకు నమస్కరింపుము.

స—తప్పు కాదా? మాకిద్దఱకు భర్తవై, యీగర్భమందున్న తేజమునకుఁ దండ్రివై, యీసంసారమునకుఁ బ్రభుఁడవైన నీకుఁ బార్వతి ముందుగా నమస్కరింపక వాకా?

పద్మ—అట్లు కాదు. ఈసృష్టి యంతయు నీది. ఈబొమ్మకుఁ జిత్రకారిణివి నీవు. మొదట వెలవెలలాడురంగులతో నున్న యీ మట్టిబొమ్మ నీకళాప్రావీణ్యముచే, నీదయామృతపురంగుల ధాళధళ్యముచేఁ బ్రాణప్రతిష్ఠ నొందిన బంగారుబొమ్మయైనది. ఇప్పు డీబంగారుబొమ్మకు సౌరభముఁగూడ నీమహిమమువలననే సంప్రాప్తమైనది. మాయింటికి మంగళదేవతవు—

స—(తనలో) పెండ్లామునకుఁ గడుపువచ్చినదని యేమియుబికియుబికి పోవుచున్నాఁడు! ఏమి యెగిరియెగిరిపడుచున్నాఁడు! ఏమి కులికికులికిపోవుచున్నాఁడు—నిజమే—దానిని జూచి సంతోషింపక నన్నుఁ జూచి సంతోషించునా? పూలున్న మొక్కను జూతురు గాని వట్టిమ్రోఁడు నెవరు చూతురు. నీరున్నకొలనికై సారసపక్షి యపేక్షించును గాని వట్టిగోతి నేల చూచును.

ఈసృష్టి యంతయు నాదే—పట్టుపురుగు తనసృష్టితంత్రియం దుఁ దాను జచ్చినట్లు నేనిందు నశింపనున్నాను. ఈసంసారము నాశనముచేసి మఱి నశించెదను—

పద్మ—పార్వతీ! అత్తకు నమస్కరింపుము.

పా—అత్తా! నమస్కారము.

పద్మ—జాగ్రత్తగ వంగవలయును జూమా!

స—(తనలో) అమ్మనీప్రేమ కాలిపోను—కడు పంతలో నేలఁ గూలిపోవు నని భయమా? ఇఁక దీవింపవలయును గాఁబోలు. (ప్రకా) శీఘ్రముగ సుపుత్త్రినిఁ గనుము—(తనలో) దీనికడుపులో నున్న పిల్ల యెముకుబొమికులు లేక లోపలనే చచ్చి యందువలనఁ గలిగిన విషవాయువుచే నిది చచ్చుఁగాక! అట్లు శిశువు చావక యెదుగుడెడల, మూఁడుతలలతో, నైదుకాళ్ళతో, నోటిలోఁ గోరలతోఁ దలలపైఁ గొమ్ములతో రాకాసిపుట్టువై లోపల నుండలేక పైఁబడి సౌందడపెట్టి దీనిని జంపి, తాను జచ్చి, మొదటియాలిని విడిచి రెండవయాలిని మరగిన పద్మనాభశాస్త్రికి, ప్రథమభార్యశాపముచేతఁ బుట్టిన రాకాసిబిడ్డ యనుపేరితోఁ జిత్రవస్తుప్రదర్శనశాలలో రెండవపెండ్లి యుండకొడుకులకు నీతిబోధకముగ నుండుఁగాక.

పా—నాథా! నమస్కారము. (నమస్కరింప వంగఁబోవుచున్నది.)

పద్మ—(పార్వతిబుజముఁ బట్టుకొని) వంగనక్కఱలేదు. నిలువుగ నమస్కరింపుము. ఎంతభద్రముగా నుండవలయు ననుకొన్నావు.

స—(తనలో) ఇఁక నీభార్యాదాసాధముఁ డీమూలెంతరాలిని జంటిపిల్ల

వలెఁ జేతులలోఁ బెట్టుకొని మోయునుగాఁబోలు. చిన్నతనము లోనే కడుపు వచ్చినదని దీనికిఁ దెగనీల్గుగానే యున్నది. చిన్న తనముననే చదువు వచ్చిన మగవాఁడు, చిన్నతనములోనే కడు పువచ్చిన యాఁడుది గర్వముచేఁ గన్ను కానకుందురుకాదా? మగవానికి జ్ఞాన మెట్టిదో, మగువకుఁ గడు పట్టిది. అది నడి వయస్సున వచ్చినయెడల మగవాఁడు తెగనీల్గఁడు. ఆఁడుది తెగనీల్గదు- చూచినవారికిఁగూడ సహజముగా నుండును. (ప్రకా) పార్వతీ! ఈదినమున నొకిలింత లెట్లున్నవి?

పా—బాధగానే యున్నవి. అత్తా! దీని కేమైన మందు లేదా?

స—మం దెంతమాత్రము పనికిరాదుసుమా.

పద్మ—ఇంకఁ దగ్గిపోవలసినదే కాదా? ఇంకను బాధించుచున్న వెం దువలననో? ఈదినమున భోజన మాలస్య మగును. కదలిక యెక్కువ యైనది. వేడిచేసి యవి యెక్కడ నెక్కువ యగు నో యని భయముగా నున్నది.

స—అంతమాత్రాన కేమియుఁ దొందర లేదు-ఈదినమున నేవస్తు వుపై మనసు పోయినదే- వెన్నయప్పములు చేయు మందువా?

పా—అబ్బె! నా కసహ్యమమ్మా-

పద్మ—పోనీ. చిత్రాన్నముఁ జేయుమందువా?

పా—ఊఁ.

పద్మ—సరోజినీ! ఆలస్యము కాకుండ సులభముగఁ దెమలును-అది యే చేయుము. పార్వతీ! దొడ్డిలో నున్న కరివేపాకుఁ గోయు దము సిమ్మళముగా నన్నుఁ బట్టుకొని రా.

(ఇద్దఱు నిష్క్రమింతురు)

సా—ఆహా! ఎంతపని జరిగినది-ఎంతపని జరిగినది. (గుండెను కొట్టు
కొని) పెండ్లి యగుట—ఆఱునెలలు కాకుండఁ బెద్దదగుట-
గర్భాధాన మగుట-మొదటిచూపులోనే భర్తకు గుండెకాయ
యగుట—నెలతిరుగకుండ గర్భవతియగుట—అట్టినెల లైదు
జరుగుట-పుంసవన మగుట-ధరణీకంపపుధాటికి హద్దున్నది.
అగ్నిజ్వాలావిజృంభణమునకు హద్దున్నది. తుపానువేగమునకు
హద్దున్నది. కాని యదృష్టధాటికి హద్దు లేదు. కొడుకును
గనుటకే కాని యంతకంటె నెందుల కని, చింపిరితలచీఁపర
కంటిచీఁదరగొట్టుముండ నీతనికిఁ గట్టివైచితిని. సమర్తాడినదో
లేదో యదియే కలువకంటి యైనది. ఇంద్రనీలకచ యైనది.
చక్కఁదనాలచుక్క యైనది. అదృష్టదేవత కెంతమహిమమో-
రూపు మార్చునే- రంగు మార్చునే-బొంతకాకి పసుపుపొత్తి
యగునే. కొంకనక్క గజ్జెలగుఱ్ఱ మగునే-అందులోఁ బ్రాయ
ము వచ్చినసమయమేమో-ఓ-చూడ నలవికాకుండ నున్నది.
అందులోఁ గడుపు. మెఱుఁగులో మెఱుఁగు. ఆమెఱుఁగులో
మఱింత మెఱుఁగువచ్చినది. వెంటనే చల్లాఱుటకే యీపొంగు
వచ్చిన దేమో? తన కిప్పుడు కడుపేల రావలయును? నాకేల
యింతకాలమున కైన రాలేదు? ఎదుటింటి పద్దమ్మ మూఁడేం
డ్లనుండి గింజుకొనుచున్నది కదా! దాని కేల రాలేదు? గర్భ
ధారణపుఁగిటు కేదో నాకిప్పుడు స్ఫురించుచున్నది. అశ్వత్థ
పూజలో లేదు. ఆంజనేయప్రదక్షిణాలలో లేదు. ఔషధా
లలో లేదు. అదృష్టములోఁ గూడ లేదు. భర్తయనురా
గములో నున్నది. భర్త తిరుగులేని విరుగులేని యనురాగము
గలవాఁడై భార్యను సమీపించినయెడల భార్య గర్భవతి కావ

లసినదే. పురాణస్థములైన సద్యోగర్భములు యథార్థములే- అవియే మహానురాగపరికల్పితగర్భములు. ఏజంతువుకూడ వంధ్య యగునట్లు సృష్టింపఁబడలేదు-నేను నాభర్తయనురాగ లోపమున గర్భవతిని గాలేదు. నాసవతియందున్న యనురాగము నాయందు నాభర్త కుండినయెడల నేనే దానికొడుకును గనియుందును. ధనవంతులభార్యలు తఱచుగా వంధ్యలుగా నుందురు. ఎందువలన? ధనవంతులలోఁ బైచూపు లెక్కువ. అందుచే భార్యానురాగము తక్కువ. పేదవాండ్రకు గరిసెల కొలఁది పిల్లలు. దరిద్రులకుఁ బైచూపుల కవకాశము లేకపోవుటఁబట్టి నిశ్చలమగు భార్యానురాగము వారిలో హెచ్చు- పనికిమాలినభర్తలు-ఉత్సాహము లేక-యుద్రేకము లేక- యనురాగ మంతకంటె లేక-తాత్కాలికముగ నైన మనసు నిలుపలేక, వరిమప్పలమీఁదనో, వ్యాజ్యెపుగొడవలమీఁదనో మనస్సుంచుకొని కునికిపాట్లు పడుచుఁ గులకాంతలయొద్ద దేవుఁడా యని పండుకొన్న నిర్భాగ్యపుమగలు పిల్లలఁ గనఁగలరా ? మూఁడేండ్లలో సంతానమును గనలేని మగవానిని విచారణ లేకుండ మూఁడేండ్లు కారాగృహమందుంచునట్లు మనదేశప్రభువులు శాసించినయెడలఁ బదిసంవత్సరములలోఁ గడుపులేనిపడుచుది కంటఁ బడునా? నాభర్త యనురాగశూన్యుఁడై నాగొంతు మొదటినుండియుఁ గోసినాఁడు. నాకీసంగతి తెలియక యాతనికిఁ బెండ్లి చేసితిని. ఆపెండ్లి యిప్పుడే సమూలము త్రుడిచిపెట్టవలయును. అందుకొఱకే గవరమ్మయొద్ద శుద్ధిచేయని నాభి యడిగి పుచ్చుకొని కొంగున గట్టుకొంటిని. ఇది చిత్రి

న్నములోఁ గలిపి దానికిఁ బెట్టెదను. ఈదినమున నోకిలింత లెక్కువ యగు నని భర్త భయపడుచునే యున్నాఁడు. అం దులో నిది పడిసిపాఁచిపోవును. అది చచ్చినఁగాని నామనస్సు నకు శాంతి యుండదు. వంటవేళ దాఁటినది. చప్పునఁ బోయి వంటచేసి, భుజియించి యిక్కడకు వత్తును.

(నిష్క్రమించును.)

ఇది షష్ఠాంకము.

శ్రీరామా!

# సరోజిని.

## సప్తమాంకము.

ప్రదేశము—పద్మనాభశాస్త్రియిల్లు.

ప్రవేశము—సరోజిని.

స—వహావ్వా! పేఁజువ్వవలె రైమని తలకెక్కినది. తలపోటు. తలలో గునపపుఁబోటు. నామనస్సులోని పోటుకంటె దానితలపోటెక్కువయా? బ్రహ్మరంధ్రము పగులనీ! కపాలమోక్షము కానీ! నాకాఁపురము తాను త్రైచుకొనునా? నాకుఁబుట్టవలసిన కొడుకును దనకడుపునఁ బెట్టుకొనునా? ఈతలపోటు మొదటినుండియు నున్నది. ఈవేళఁ గారణాంతరములచే హెచ్చినది. నాథరకు నాయందనుమానము లేదు. అదిగో! ఇటు వచ్చుచున్నాఁడు. (తనలో) ఎందులకు వచ్చుచున్నావు? చచ్చినదా లేదా? ఇంకను జావలేదా? చచ్చినఁగాని నామొగముఁ జూడవలదు-పో-

(పద్మనాభశాస్త్రి ప్రవేశించును)

పద్మ—సరోజినీ! ఇది యేమి? వాంతులు క్రమముగా హెచ్చిపోవుచున్నవి. నాలుక జిలజిల-ఒక్కటే దాహము. బిందెలకొలఁదిఁ దాగివుచున్నది. నీరంతయు రెండురెట్లు తిరిగి పోవుచున్నది. ఏమి చేయుదము?

స—(తనలో) వాంతులు హెచ్చిపోయి యింకను హెచ్చిపోయి యావ
లకు దారి యున్నయెడలఁ బిల్లప్రేగు పడిపోయినఁగాని నాకు
శాంతి కలుగదు. (ప్రకా) నాథా! నాకు గుండె దడదడ
లాడిపోవుచున్నది. అక్కడఁ గూరుచుండి చూడలేక యిక్క-
డికి వచ్చి యేడ్చుచున్నాను. నాథా! నన్నేమి చేయుమం
టివి? నాప్రాణ మిచ్చెదను దీసికో-దానిని గాపాడుకో-అంత
కంటె నే నేమి చేయఁగలను?

పద్మ—అయ్యయ్యో! ఎట్లు? ఎట్లు? దానియొద్దఁ గూరుచుండుము.
నేను బోయి వైద్యుని బిల్చుకొనివత్తును.

స—నన్నుఁ బిలువకుండ నీవు దానిని విడిచి యిక్కడ కేల వచ్చితివి?

పద్మ—రవంత మాగ్రన్నువచినది. అందుకొఱకు వచ్చితిని.

స—(తనలో) ఈమాగన్ను మాగన్ను నిల్చుగు డ్లైపోఁగూడదా?
గాజుచూపైపోఁగూడదా? అట్టిస్థితి నేను జూతునా. కాలిపో
వుచున్న నాకన్నుల కాదర్శనమే యమృతాంజనము. (ప్రకా)
నాథా! మాగ్రన్నన నాకు బోధపడలేదు- రవంతకునుకు
గల్గిన దనియేనా నీయభిప్రాయము?

పద్మ—సామ్మసిల్లి కొంచెము కునుకుచున్నట్లున్నది.

స—వైద్యుఁడు వలదు-ఎవ్వరును వలదు. చిత్రాన్నములోఁబడిన
నూనె, యావకారము మొదలగునవి పైత్యవృద్ధిచేసి యింత
యల్లరి పెట్టినవి-మరేమియు భయము లేదు. నీవుపోయి యా
మెయొద్దను జప్పుడు చేయకుండఁ గూరుచుండుము. నే ని
క్కడ దానియారోగ్యముకొఱకై మ్రొక్కులు మ్రొక్కుకొని
ముడుపులు కట్టుకొని దైవప్రార్థనఁ జేసికొనుచుఁ గూరుచుండె
దను.

పద్మ—మతేమియుఁ బ్రమాదము లేదందువా?

స—లేదు. లేదు.

పద్మ—తథాస్తు! నీనోటివాక్యమే నాకు మొదటినుండి ఫలించుచున్నది. (పోవును.)

సరో—చావదా? చావదా? నాయాశ నిరాశయేనా? నాశ్రమము నిష్ఫలమేనా? చచ్చునని పొంగిపోయితినే—నాపొంగు మండిపోను—చావదా—చావదా? ఇఁక ముందుమాట యేమి? గొంతుపిసికి చంపుదునా? ఊహు—వెల్లడి—వెల్లడి. పనికిరాదు. కాలుజాఱినట్లు నూతిలోఁబడఁద్రోతునా? నీరుతోడఁగ నలసిపోవు నని, ప్రక్కనరములు నాగిపోవు నని దానిభర్త దానిని నూతియొద్దకు వెడలవల దనినాఁడు. ఈబండపనికూడ నెవరు చేయుచున్నారు—నేను. సుఖపరమాణువైన లేకుండఁ గష్టపర్వతము నెత్తి కెత్తుకొని నే నేడ్చుచున్నానే. ఓభగవంతుఁడా! నాకష్టము లిప్పటికైన గట్టెక్కింపవా? ఎంతకాల మీయవమానమును సహింతును! బందిపోటుదొంగను రక్షించి యింటియిల్లాలిని బాధింతువఁటయ్యా! ఇది యేటిన్యాయము. నా భర్తను బొందుటకు నా కధికారమున్నది. అందుకుఁ బ్రతిబంధించువారిని జంపుటకు నాకు స్వాతంత్ర్య మున్నది. సంసారధర్మ మిదియే—లోకధర్మ మిదియే. ఒక్కయింటిలోనిపోరు వంటిదే రాష్ట్రములోనిమహాయుద్ధము. గుండెలు మండుకొని పోవుచున్నవి. చావదా? ఇంకను జావదా? అవులింతలోఁ జచ్చినవా రెందఱోయున్నారే. పొరఁబాఱఁగఁ బ్రాణమువిడిచినవా రెందఱో యున్నారే. గుండె యాకస్మికముగా నాఁగిపోవఁ జచ్చినవా రెందఱో యున్నారే. విషముపెట్టినను నిది

చెప్పినది కాదే! దీనియాయుర్వు మండ—దీనియదృష్టము మండ—దీనిగొంతుఁగోయ. అదిగో! నాభర్త కాలిచప్పుడు వినఁబడుచున్నది—దైవప్రార్థనముఁ జేయుచున్నాను. ఇట్టికోపము—అట్టి శాంతి. ఇట్టియేడుపు—అట్టిమందహాసము, ఇట్టికడుపుమంట—అట్టిమాటచలువ బహుకష్టమైన నాటకమును జరిగించుచున్నాను.

(పద్మనాభశాస్త్రి ప్రవేశించును.)

స—(కన్నులు మూసికొని నిలువఁబడినట్టిగా) ఓపరమేశ్వరా! నాకుఁ దండ్రిలేఁడు, తల్లిలేదు. వెఱ్ఱివాఁడైన యన్న యొక్కఁడున్నాఁడు—అతనికి భార్యలేదు. ఈపిల్లను నాబిడ్డగాఁ బెంచుకొనుచున్నాను. స్త్రీప్రకృతిచేఁ గల్గిన యసూయచేత దానిని విషనాడు మని నాభర్తకు బోధించినమాట నిజము—అందులకై లెంపలువైచుకొనుచున్నాను. ఇంతకంటె నేనేపాప మెఱుఁగను. భర్తయే దైవ మని భావించియుంటిని—ఈపిల్లను రక్షింపుము. నా కంతకంటెఁ గోరికలేదు—నాప్రార్థనము నాలకింపుము. ఈసంసారమును విచ్ఛిత్తు చేయకుము. నాభర్త దయాళుఁడు—మహాత్ముఁడు—నేను బొందవలసిన సుఖమేదియు నిఁక లేదు. ఈసమయమున నాకు మృతిని గటాక్షించి నాబిడ్డను రక్షింపుము.

పద్మ—(చేయిపట్టుకొని) నీకు మృతి యెందులకు?

స—ఆ. ఆ ఎందుల కిప్పుడు వచ్చితివి—కుఱ్ఱది యేలాగున నున్నది?

పద్మ—ఏమియుఁ దొందరలేదు. శాంతముగా నిద్రించుచున్నది. నీ విప్పుడు చేసినభగవత్ప్రార్థనము సఫలమైనది.

స—నాథా! చల్లనిమాట చెప్పితివి. దానిని వదలి యిఁక రాకుము

పద్మ—నీతో నీశుభవార్త చెప్పుటకై వచ్చితిని. పోవుచున్నాను. నీ విక్కడనే పండుకొందువా ?

స—ఆ.

(పద్మనాభశాస్త్రి పోవును.)

స—మొదటినుండియు వాంతు లుండుటచేత మంతు లోపల నిమిడినది కాదు—ఇమిడియుండినయెడల హాయని యతఁ డేడ్చుచుండవలసినది. కెవ్వున నే నార్చియుండవలసినది. ఇప్పటి కాపరిస్థితి కలుగలేదు. ఇఁక నేమి చేయుదును ? నేను జేయుట కొందులకు ? ప్రకృతిసంబంధమైన శాహాటమార్గ మేమైనది? ప్రపంచమున నిముసమున కొక్కమనుజుఁడు చచ్చుచున్నాఁడు. అటులే పుట్టుచున్నాఁడనుకో—పుట్టుకతో మన కిప్పుడు ప్రసక్తి లేదు. చావే జగతిలో సర్వమంగళమార్గము—నిముసమున కొక్కఁడుచొప్పునఁ జచ్చుచున్నాఁడు—గాలిలో తెప్పపాటులోఁ గోటిజీవములు పోవుచున్నవి—సముద్రమున నంతకంటె నెక్కువగాఁ బోవుచున్నవి. ఎక్కడఁ జూచినఁ జావే—ఈ పనికిమాలిన యింటిలోఁదక్క. ఓమృతిదేవతా ! సముద్రములోని గోతులలోఁ దిరిగి, పాతాళములోని సురంగములు తిరిగి, చీమపట్టని నరదలలోఁగూడఁ దిరిగి—యథేష్టముగఁ దిరిగి జీవనాశనముఁ జేయుచుంటివే ! ఆహ్వానించి, బతిమాలి, యేడ్చి, మొత్తుకొన్నను నిక్కడకు రావేమి ? నీశక్తి యిక్కడ సన్నగిల్లిన దేమి ? ఒక్కచప్పరింపుతో రెండుజీవములరుచి చూడఁగలవే—నే నేమైన నీకు జడియుదు ననుకొంటివేమో—దానిని మొదటఁ దిని యది యరిగిపోయినవెనుక నన్ను నీపాటఁ బెట్టు

కొనుము. దాసిశవము, నాశవము నొక్కసారి నీపొట్టనుం
డుట నాకిష్టముకాదు—ఎప్పుడు—ఎప్పుడు—త్వరగాఁ గానీ—నీకు
మునపటిప్రయోజకత లేదు—నీగాటు తగ్గినది. వత్సనాభి
యక్కలకట్టి యైపోయినదే—ఇఁకఁ బోయి పండుకొందును—పం
డుకొందు ననుమాటయే కాని నాల్గురాత్రులనుండి నిదుర
లేదు—

(నిష్క్రమించును.)

ఇతి సప్తమాంకము.

శ్రీరామా!

# సరోజిని.

## అష్టమాంకము.

పరిదేశము—వీథి.

ప్రవేశము—వాతాపిశాస్త్రి, నారాయణశాస్త్రి.

వా—ఆఱుమాసములు కాకుండ మూఁడుసారులు కలిసికొంటిమి-మొదట గర్భాధానమునకు, రెండవసారి పుంసవనమునకు, మూఁడవసారి పుత్త్రినినామకరణోత్సవమునకు- ఆలాగున శుభముల మీఁద శుభములు రావలయును.

నా—పేదముండకొడుకుల యింటిలోఁ బదునాల్గు శుభములు వచ్చుట కంటె ధనికునియింట్లో నొక్కచావు వచ్చిన మంచిది. అది దేశోపకారకము. టొక్కుటొక్కు లెక్కచినుకులతో నేమగును! కుంభవృష్టి కలుగవలెను.

వా—నీ వట్లు కోరఁదగదు.

నా—కోరలేదే. ప్రకృతిధర్మమును చెప్పినాను. నేను కోరినప్పుడే కాని భాగ్యవంతునియింటినుండి వాహనము బయలుదేఱదా యేమి?

వా—శుభమునుండి వెంటనే యశుభములోనికి దృష్టి యేల?

నా—శుభము వెంటనే యశుభము. ప్రపంచధర్మమంతే కాదా? పైప్రపంచములోఁ బగలు రాత్రి యేలాగో లోపలిప్రపంచములో శుభము నశుభము నాలాగు—అప్పుడే పోవుచున్నా వేల ?

వా—రాత్రి యగుచున్నది. ఇంటికిఁ బోవలదా ?

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.

---

ప్రదేశము—పద్మనాభ శాస్త్రియిల్లు.

ప్రవేశము—సరోజిని, తొట్టెలో బాలకుఁడు.

స—అనుకొన్నయంత యాపద సిద్ధించినది. వంశోద్ధారకుఁడు పుట్టినాఁడు. పురిటిదినములలో నేను బిల్లవానిని ముట్టుకొన్నయెడల వంట కక్కఱకురా నని వానిని ముట్టుకొనలేదు. నేనే యుగ్గుపోసినయెడల నంగిటికి వ్రేలడ్డుపెట్టి యుక్కిరిబిక్కిరిచేసి చంపనా ? నేనే నీళ్ళుపోసినయెడల నంగిళ్ళు నొక్కునప్పుడు గొంతునొక్కి చంపనా? నేనే నీళ్ళుపోసినయెడల గొంతుక కష్టముగ ధాన్యపుగింజ వేసి చంపనా ? ఎంతమహావకాశము దాఁటిపోయినది. నాకర్మము- ఇంతవఱకుఁగూడ నక్కఱలేకుండనే యేడవనాఁటిరాత్రి యెన్నమ్మపురుగనై బ్రహ్మరంధ్రమున మహోత్సాహమున గట్టిగ నొక్కియుండనా ?

ఇంతవఱకు నీబానిసకొడుకున కాయు వుంటచే నట్లు జరిగి నది కాదు. ఈదినమునఁ బుట్టినస్నాన మగుటచే సాయంకాలమువఱకు నీబిడుతఁడు నాయధీనుఁడై యుండును. అదిగో! అక్కడ నుయ్యేలలో దాలిలోఁ గుక్కపిల్లవలెఁ బండుకొన్నాఁడు. వాని నిప్పుడే తీసికొని చెఱువులోఁ బాఱవైతును. (పిల్లవానిని తీసి చేతులలోఁ బెట్టుకొనును.) నాప్రశాంతమైన యింటిలో నీవు మొండిచేయివలెఁ బుట్టి నాకు ముప్పుఁ దెచ్చి నావు. నిన్నుఁ దుంచి పాఱవైచినఁగాని యీకీడు తొలఁగదు. కొబ్బరకాయను బాత్రిముపైఁ బగులఁగొట్టినట్లు నీతల యీ గడపపై బళ్ళునఁ బగులఁగొట్టఁగలను గాని నీతలిదండ్రులరక్తముచే నాముంగిలి యపవిత్రమగును. అదిగో- వారిద్దఱు వచ్చుచున్నట్లలికిడి యగుచున్నది. ఇఁక నీవేషము మార్పవలయును. క్రొత్తరాగమునఁ గ్రొత్తదరు వందుకొని క్రొత్తయాట యాడవలయును.

(పద్మనాభశాస్త్రి పార్వతి ప్రవేశింతురు.)

ప—(వారు వచ్చిన ఎఱుఁగనట్లు నటించుచు) ఈపసన్నపండుకొఱకు- ఈబంగారుకొండకొఱకు, ఈవంశోజ్జీవకునికొఱకుఁ బదునాలేండ్లుతపించితిని. శ్రీనివాసమూర్తీ! నీకటాక్ష మిప్పటికిఁ గలిగినది. జగన్నాథదేవా! అంధకారబంధురమైన నాయింటికి దీపమును గటాక్షించితివా మహాప్రభూ! జ్యోతిర్మయులగు సూర్యచంద్రు లెంతకాల మాకసమున వెలుగొందుదురో యంతకాల మీదివ్యతేజ మిచ్చటఁ బ్రకాశించుఁగాక. తండ్రీ! వంశరక్షకా! పాపాత్మురాలనైన నేను నీమొగ మింతవఱకుఁ దిన్నగఁ జూడనే లేదురా! రేయుఁబవళ్ళు వంటపనిచేతఁ

బురిటిబిడ్డవైన నిన్ను ముట్టుకొనలేక పోయితిని. నాచేతులు ముక్కలైపోను. నాకన్నులు కాలిపోను. (దీపపువెల్తురికిఁ దెచ్చి) ఇదిగో- అడుగుపెదవిక్రింద గుంట. ఇందున సరిగా నాపోలిక- ఆహా! ఈపాదాలు,పిక్కలు సరిగాఁ దండ్రివికదా! ఈచెవు లచ్చముగ నాయిల్లునిలువఁబెట్టినకులదేవతయగుతల్లివి. ఆహా! తల్లిదండ్రులయచ్చులు, మేనత్తమేనమామలయచ్చులు, ముత్తవతల్లులయచ్చులు దేవుఁడు జాగ్రత్తగా దాఁచిపెట్టియుంచు నుగాఁబోలు. గట్టిగా ముద్దుఁబెట్టుకొన్నయెడల లేచి యేడ్చు నేమో! (ముద్దుఁబెట్టుకొనును.)

పద్మ—చూచితివా పార్వతీ! మన మెదురుగానున్నప్పుడు దానికి బిడ్డను ముద్దుఁబెట్టుకొనుటకు తగనిసిగ్గగుటచేత నెవ్వరులేకుండఁ జూచి ముద్దుపెట్టుకొనుచున్నది. దాని కెంతప్రేమయో చూచితివా.

పా—మామేనత్తయే యిఁకఁ గుఱ్ఱవానిని బెంపవలయును. నాచేత నేమగును. అందుచేత వంటలక్క నెవ్వతెనైనఁ గుదిర్చి మా యత్తకు వంటబాధ లేకుండఁజేయరాదా? అయ్యో! అటు చూడుఁడు. వెఱ్ఱిదానిలాగున నెంతసేపు ముద్దుబెట్టుకొనుచున్నదో. నాథా! బిడ్డకుఁ బాలిచ్చి వెంటనే వచ్చెదను. మీ రిక్కడ నుందురా-నాతోవత్తురా?

పద్మ—ఇప్పుడే యిచ్చితివికాదా-రెండుగంటల యెడము లేకుండమాత్ర మీయవలదు. ఇప్పుడు మనము పోయినయెడల సరోజిని కుత్సాహభంగ మగును.

స—ఎంతసేపు చూచినను దనివితీరదు. ఎన్నిముద్దులు పెట్టుకొన్నను దనివితీరదు. మావంశ మంకురించినయెడల మూఁడవనెలలోఁ

పాండురంగవిఠలుని దర్శనముచేసి వత్తునని మ్రొక్కుకొంటిని. మాయాయన కిప్పుడు డబ్బులేదని యొక్కటే చదువు-నాచంద్రహారమును దాకట్టుపెట్టి తీర్థయాత్ర చేసికొనక తప్పదు. కదలుచున్నావు. నాతండ్రీ! లేచెదవా-ఇప్పుడు వలదు-మీయమ్మ కారము దినుచున్నది. పొగవైచుకొనికాని రాదు. అంతవఱకు జోలపాట పాడెదను. (ఉయ్యెలలోఁ బెట్టును.)

జోలపాట.

జోసూర్యనిభ తేజ-జోసుందరాంగ
జోసౌమ్యగుణధామ-జోసరోజాక్షా ॥జోజో॥
ఇద్దఱుతల్లుల-ముద్దుబిడ్డఁడవు
సద్దుసేయక నిద్ర-సల్పుమో తండ్రి ॥జోజో॥

పా—మాయత్తకుఁ బిల్లలు లేరుకదా-జోలపాట యెట్లుపాడినదండి?

పద్మ—పిల్లలు గనుటకు జోలపాట కేమి సంబంధమే? జోలపాటలు గొంతుకలోని-పిల్లలు కడుపులోని. పాటలు చదువుతో వచ్చును కాని యెల్లరామాయణములోఁ బిల్లలు పుట్టుదురా? పిల్లలఁ గననివారు పిల్లలతో సంబంధించిన యెన్నికార్యములు చేయుచుండుటలేదు? పిల్లలున్నదే కాని మంత్రసానిపనికిఁ దగదా? పిల్లలఁ గనుటలో సాహాయ్యము చేయుచున్న వైద్యవిశారదలగు స్త్రీలెందఱో-స్త్రీరూపధారిణు లన్నమాటయే కాని, కడుపు, కాలు పదునాల్గుతరములనుండి యెఱుఁగనివారా? నీవు దానియొద్ద రేపే జోలపాట నేర్చుకో-మనము రవంత సేపు పుంటిగదిగుమ్మములోనే యుబుసులాడుకొందము-రమ్ము-(ఇద్దఱు నిష్క్రమింతురు.)

స——వెళ్లినారు. (పిల్లనీవలికిఁదీసిపట్టుకొని) బానిసకొడుకా! నీయిల్లు వల్లకాడుగాను. నీతల్లిదండ్రులమూలమున నీచావు నాల్గునిముసము లాలస్యమయ్యెనురా-నిన్నిప్పుడే కట్టఁగట్టి యుండచుట్టి చెఱువులోఁ బాఱవైతును. (నడచును.) పరమాయువగు నూటయిరువదేండ్లును నీకుఁ బండ్రెండవదినము రాకుండనే తీరునట్లు చేసెదను. నీచావుతో నీతల్లిదండ్రులు కృశించి, కృశించి చత్తురుగాక-నాసవతీ! నాసవతిమగఁడా! మీరట్లు చావకున్నయెడల నేను జచ్చి పిశాచమనై యొకరి నొక్కరు దరిచేరకుండునట్లు మీనడుమ నిల్చి మీకడుపులలో నెడతెగని మంటఁబుట్టించి రేయుంబవల్లు నెత్తి నోరు కొట్టుకొనునట్లు చేయుదును. ఈకుఱ్ఱముండకొడుకెట్లు నవ్వుచున్నాఁడో- ఈనవ్వువలన మనస్సునకుఁ గల్గినక్రౌర్యము తగ్గుచున్నట్లున్నది. ఈవెక్కిఱించినమొగమింకఁ జూడఁగూడదు. మొగముపై గుడ్డవైతును. (నిష్క్రమించును.)

(పార్వతిప్రవేశించును.)

పా——ఇంతకుముందు నామేనత్త నాబిడ్డను ముద్దుగొనునప్పుడే పాలు చేఁపువచ్చినవి. అప్పటి కడఁచుకొంటిని. ఇప్పుడు బిడ్డపై భ్రాంతి యెక్కువగా నున్నది. పాలిచ్చెదను-(తొట్టియొద్దకుఁ బోయి) అయ్యో! బిడ్డఁ డేఁడీ! అత్తా! అత్తా! వంటయింటిలోనికిఁ బోయియుండునా? నాథా! నాథా! అక్కడను బిడ్డను దీసికొని మాయత్త వచ్చినదా?

(లోపల) నేను జూడలేదు. సరోజినీ! సరోజినీ! ఇక్కడ లేదు- పార్వతీ! వచ్చుచున్నాను- తొందరపడకు-

(దగ్ధనాగశాస్త్రి ప్రవేశించును.)

పద్మ—కనఁబడలేదా ? కనఁబడలేదా ?

పా—అయ్యో ! లేదు-లేదు.

పద్మ—తొందరపడకు-కోవెలలో రామదేవునకు మ్రొక్కించుటకుఁ దీసికొని పోయినదేమో—నేను జూచివత్తును. నీవిట నుండుము.

పా—నేనుండఁ గలనా? నేనును వత్తును. (ఇద్దఱునిష్క్రమింతురు.)

స—(ప్రవేశించి) చెఱువునకందఱుపోవుమార్గములో జనులసందడి యడఁగలేదు. మఱియొకదారినిబోయి రేవులేనిచోటఁ బాఱవైతును.

(నిష్క్రమించును.)

(పద్మనాభశాస్త్రి, పార్వతి, దీపాలంతోఁ బ్రవేశింతురు)

పా—అయ్యయ్యో ! ఏమి చేయుదము ? ఎక్కడను గానఁబడకుండనున్నాఁడు.

పద్మ—అయ్యో ! ఎవ రక్కడ! బిడ్డనెత్తుకొని సరోజిని యక్కడకు వచ్చినదా?

(నేపథ్యమున) ఆవైపునకుఁ బోవుచున్నది.

పా—ఏవైపున కయ్యో-నాయనా ! చెప్పవయ్యా.

పద్మ—రమ్ము. రమ్ము. (నిష్క్రమింతురు)

స—(ప్రవేశించి) హా ! (పరుగెత్తుచు నేలగోతిలోఁ బడిపోవును. ఆగోతిముం దున్న యంచుఁ బట్టుకొనబోవును. చేతిలో నున్న బిడ్డ నూతియంచునఁ బడిపోవును.)

(పద్మనాభశాస్త్రి, పార్వతి ప్రవేశింతురు)

పా—(పరుగెత్తి) అదిగో బిడ్డ. (తీసికొని) నాయనా! బ్రదికియుంటివా?

పద్మ—ఆ. ఆ. (నూతియొద్దకుఁ బోయి) సరోజిని యిందుఁ బడిపోయెనుజుమీ—సరోజినీ ! ఇదిగో—ఈనాయుత్తరీయమును బట్టుకొనుము—నీటిలోఁ గల్లోల మెక్కువగా నున్నది—హరిహరీ !

ప్రాణావసానప్రశమ మొందుచున్నదికాఁబోలు—ఇఁకఁ గార్యము లేదు. (తనలో) ఎంతకాలము క్రోధము దాఁచి తుద కెంత పని చేసినది! మొదటిరెండుమూఁడుదినము లీమెపై నాకు సందేహము కలిగినది. తరువాత నిష్కళంక చర్యనుబట్టి నా కాసందేహము పూర్తిగ నశించినది. పిల్లవానిని జంపుకొనుటకే కానియెడల నీమె యిట్లు పరుగెత్తుకొని చెఱువునొద్ద కేల పోవలయును? అందులోఁ దప్పుదారి నేల పోవలయును. ఆల యములలోని దేవులకు మ్రొక్కించుటయే యీమె యభిప్రా యమైనయెడల తల్లిదండ్రులమైన మాతోఁ జెప్పియుండదా? ఇదివఱ కామె ప్రవర్తన మంతయు దొంగప్రవర్తనము. ప్రార్థన లన్నియు దొంగప్రార్థనలు. మూఢుఁడనై తెలిసికొనలేకపోయితిని. ఏమి తెలిసికొనుటకైన సందేహలేశమైన లేదు- ఆహా! ఎంతపని చేసినది- భార్యసెలవును బొందియో, భార్య బలాత్కారముననే చేసికొన్న రెండవపెండ్లికే యిన్ని పాట్లు వచ్చినవి. భార్య కిష్టము లేకుండఁ జేసికొన్నవారిబ్రతు కేదియో చెప్పఁదరమా? చెఱువులోఁ జాకిరేవువైపునఁ బిల్ల వానిని బాఱవేయవలయు ననియే పోయినది. కాని చాకివా నిగోతిలో నాకస్మికముగఁ బడిపోయినది. ఆమెమర్యాదమాత్ర ము పోఁగొట్టఁదగదు.

పా—శిక్షను దీసికొని మాయత్త యిక్కడకు రానేల? తాను నూతిలోఁ బడనేల?

పద్మ—(తనలో) భగవంతుఁడా! ఉత్తమురాలగు నాయిల్లాలసూ యాధిక్యముచే నాఁడు పెద్దపులికంటె క్రూరాధికయై యెంత పని చేసినది? నన్ను నవిశ్వసించి యిట్లు చేసినది. నాభాగ్య

ప్రాణము పోయినది. ఆమెమర్యాద పోకుండునట్లు కటాక్షింపుము. (ప్రకా) పార్వతీ! చెఱువుగట్టున నున్న సిద్ధేశ్వరుని యాలయములోని విభూతిని బిల్లవానికిఁ బెట్టుటకై యీమె బిడ్డను దీసికొనివచ్చుచుఁ బ్రమాదమున నేలగోతిలోఁ బడెను. తనతోపాటు పిల్లవాఁడుకూడ నూతిలోఁ బడిపోవునేమో యని జడిసి తా నట్టిప్రాణావసరమునఁ బిల్లవానిని రక్షింపనెంచి నేలమీఁదికి విసరివైచినట్లు నిశ్చయింపవలసియున్నది. బిడ్డకొఱకే యీమె నాకు నిన్ను వివాహ మొనర్చెను. తనప్రాణము పోఁగొట్టుకొనియైన నీబిడ్డను రక్షించి మనకిచ్చెను. పార్వతీ! ఆమెకు నమస్కరింపుము- భగవంతుఁడామె యాత్మకు శాంతినిఁ బ్రసాదించుఁగాక—త్వరలో నింటికిఁ బోయి యచ్చట జరిగింపవలసిన చర్య జరిగింపవలయును. కష్టాంతమైన నాచరిత్రకు

> ధరణి యీతిబాధలు లేక ♦ తనరుఁగాక
> ప్రజల యన్యోన్యవైరముల్ ♦ పాయుఁగాక
> కవిత రాజపోషణమునఁ ♦ గ్రాలుఁగాక
> నీతిపాలనమున రాజు ♦ నెగడుఁగాక.

యను భరతవాక్యము తగదుకదా.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది అష్టమాంకము.

సంపూర్ణము

---